# ఆంధ్రపత్రిక

316900



The Andhra Patrika, Madras, | Regd No. 1118, Vol. 34 No. 130 TUESDAY 2nd SEPTEMBER 1947 వెల ఒక అణా | Founder: K. Nageswara Rao

# 'పంజాబ్ దురంతాలు అంతర్యుద్ధంకంటే ఘోరంగా ఉన్నవి'

## సురవర్దీతో గలసి సెప్టెంబరు 2 న నౌకాలీకి మహాత్ముని ప్రయాణం

### ఒకటిరెండువారాలు అక్కడుండి పిమ్మట పంజాబుకు వెళ్లాలనిగాంధిజీసంకల్పం

కలకత్తా, ఆగస్టు 31: సెప్టెంబరు 2 వ తేదీ ఉదయం చిట్టగాంగ్ మెయిలులో, మహాత్మా గాంధీ, సురవర్ది గారలు నౌఖాలీకి బయలుదేరుతారు. ఈవిషయాన్ని నేటి ప్రార్థనానంతర సమావేశంలో గాంధీజీ వెల్లడించారు. మహాత్ముని వెంట, ఆయన మనుమరాలు మనుగాంధి, సేవాగ్రాం ఆశ్రమవాసి విశ్వా నిర్మల కుమార్ బోస్, మహాత్ముని స్వంత సిబ్బందిలో ఒకరు నౌఖాలీకి వెడతారు.



నౌఖాలీనుంచి యీరోజు ఉదయమే ప్యారీలాల్ (మహాత్ముని కార్యదర్శి) వచ్చాడు. నౌఖాలీ స్థితిగతులను మహాత్మునికి ఎరిగించాడు. నౌఖాలీ పరిస్థితి అంత చెడుగాలేదు. అందుచేత మహాత్మాగాంధీ నౌఖాలీలో ఒకటి రెండు వారాలకన్నా ఎక్కువ ఉండకపోవచ్చును.

నౌఖాలీశాంతియాత్ర త్వరలో నే పూర్తిచేసుకొని, అవసరమైతే, వెంటనే మహాత్ముడు పంజాబు వెళ్లవచ్చు. సంక్షుభిత పంజాబును సందర్శించాలనే ఆసక్తి యిటీవల కొలదిరోజులుగా గాంధీజీకి పుట్టింది. కాని ఆయన ప్రస్తుతం పంజాబు రావలసిన అవసరం యేమీలేదని, శాంతి స్థాపనకై ప్రభుత్వం శాయశక్తులా కృషి చేస్తున్నదని న్యూఢిల్లీ అధికారవర్గాల వారు గాంధీజీకి తెలియజేశారు.

మహాత్మాజీకి ముస్లింలసత్కారం

మహాత్మాజీకి స్వాగతాన్నిస్తూ, హిందూముస్లిం సమైక్యతను సంస్మరిస్తూ, దిగువ చిత్పూర్ రోడ్డు ముస్లింలు యేర్పాటుచేసిన విందుకు మహాత్ముడు నేటి మధ్యాహ్నం హాజరైనారు. విధ్వంసమైన దేవాలయాల పునర్నిర్మాణం నిమిత్తం 1001 రూపాయలను ముస్లింలు మహాత్మునికి కానుకగా సమర్పించారు. ఈ విందు సభకు బెంగాల్ మాజీప్రధాని సురావర్దీ అధ్యక్షత వహించాడు. హిందువులు, ముస్లింలు కాలాయంతం ఈ భయ సోదరులై యుండాలని మహాత్ముడు కోరారు. ఈ సామరస్యభావాన్ని హిందువులూ, ముస్లింలూ, పరస్పరం కలిసి కనిచేయాలని, యీ సామరస్య ప్రభావం, తూర్పు, పశ్చిమ పంజాబులపై ఉండాలని మహాత్మాగాంధీ తన ఉపన్యాసంలో తెలియజేశారు.

కలకత్తా నగరకలహాలలో దీనంగా నష్టపడిన ప్రజల పునరుద్ధరణకు కనీసం ఒక కోటిరూపాయలు కావలసి ఉంటుందని, పశ్చిమ బెంగాలు ప్రధాని డా॥ పి. సి. ఘోష్ తనకు చెప్పినట్లు గాంధీజీ తెలియజేశారు.

పునరుద్ధరణకు కావలసిన నిధిని హిందువులు, ముస్లింలు కలసి సేకరించాలని, అల్లర్ల ఫలితంగా పడి తిను యిండ్లను, షాపులను ఖాళీచేసి వెళ్లిపోయినవారికి, వారు ఖాళీ చేసిన యిండ్లను, షాపులను ఖాళీచేయించి అప్పగించాలని గాంధీజీ విజ్ఞప్తి చేశారు.

నగరంలో యిప్పుడు యేర్పడిన శాంతి చిరస్థాయిగా ఉండేట్లు చేయాలని, తామంతా ఒకే జాతివారమని భావించి, హిందూ ముస్లింలు అన్యోన్యంగా మెలగాలని సురావర్ది విజ్ఞప్తిచేశాడు.

శాంతిస్థాపనా కార్యక్రమంపై కడచిన సంవత్సరం అక్టోబరు మాసంనుండి నౌఖాలీలో ఉంటున్న ప్యారీలాల్ యీ ఉదయమే అక్కడినుంచి వచ్చి గాంధీజీని కలుసుకొన్నాడు. ప్యారీలాల్ వెంట నౌఖాలీను సివప్పవచ్చా భూషణచౌదరి కూడా గాంధీజీని సందర్శించాడు.

## బ్రిటనును ఏకము చేయగలవాడు

### ఒక్క మౌంట్‌బేటనే

'సండేడిస్పాచ్'లో ఒక పాఠకుని లేఖ

లండన్, ఆగస్టు 31: 'భారతదేశము నుండి తిరిగివచ్చి బ్రిటను ప్రధానిగానుండవలెనని, అన్నిపక్షములవారితో కూడిన ప్రభుత్వమునకు నాయకత్వము వహింపవలెనని ఇండియా గవర్నరుజనరలు లార్డు మౌంట్‌బేటనును ఆహ్వానింపవలసి యున్నది' అని ఒక పాఠకుడు వ్రాసిన లేఖను 'సండేడిస్పాచ్' పత్రిక నేడు ప్రచురించినది. లార్డు మౌంట్‌బేటను మహా సమర్థుడు. అన్నితరగతులవారి అభిమానాలు చూరగొన్నవాడు. పార్టీరాజకీయములలో ఆయన కలియలేదు. ప్రస్తుత సమయమున బ్రిటనునందలి అన్నిపక్షములను ఏకముచేయగలవాడు నిజముగా ఆయన ఒక్కడే' అని లేఖకుడు వ్రాయుచున్నాడు.

## తూర్పుపంజాబ్‌లోపరిస్థితి పూర్తిగా చక్కబడినది

### శరణార్థులకు అవసరమైన సహాయ సదుపాయాలు చేస్తామని పటేల్ హామీ

న్యూఢిల్లీ, ఆగస్టు 31: భారత ప్రభుత్వ హోముశాఖామంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్‌గారు ఈరోజు ఉదయము జలందరు వెళ్లి స్థితిగతులను విచారించి సాయంత్రమునకు తిరిగి వచ్చిరి.



తూర్పుపంజాబు పరిస్థితులు పూర్తిగ చక్కబడినటులేనని రాష్ట్రప్రభుత్వపు ప్రచారకశాఖ అధికారి నేటి సాయంత్రము ప్రకటించెను. పశ్చిమ పంజాబునుండి ముస్లిమేతర కాందిశీకుల తీసుకొనివచ్చుటకుగాను ఎనభైట్రక్కులు నేడు జలందర్‌నుండి వెళ్లినవి. కాందిశీకులను తీసుకొనివచ్చుటకు మోటారుడ్రైవరులుగ పనిచేయువారు కావలసియున్నట్లు తూర్పుపంజాబ్‌ప్రభుత్వము ప్రకటించెను.

హోషియార్‌పూర్ జిల్లాలోని ముస్లిమేతర ప్రాంతములందలి పరిస్థితులు క్రమముగ చక్కబడుచున్నవి. కాని ముస్లిం ప్రాంతములందలి పరిస్థితులుమాత్రము ఇంకను ఆందోళనకరముగనే యున్నవి. అమృతసర్ పూర్వస్థితికి వచ్చెను. హిస్సార్, భివానీ నగరములందు అల్లరులు జరిగినట్లు వర్తమానము వచ్చెనుగాని, వివరములు తెలియరాలేదు.

సర్దార్ వల్లభాయ్ పటేల్‌గారు ఢిల్లీనుండి ఈ ఉదయము మిన్నటికి విమానముపై వచ్చిరి. తూర్పు పంజాబు ప్రధాని డాక్టర్ గోపీచంద్ భార్గవ జలందరు డివిజను కమీషనరు, ఇతర అధికారులు విమానాశ్రయము వద్ద సర్దార్ పటేల్‌గారికి స్వాగతము చెప్పిరి. కాందిశీకులకుగాను తూర్పు పంజాబు ప్రభుత్వము చేసిన ఏర్పాట్లను గురించి గవర్నరు, ప్రధానమంత్రి, మాస్టర్ తారాసింగ్, ఇతర ఉన్నతోద్యోగులతో చర్చించిరి. కాందిశీకుల సమస్యను పరిష్కరించుటకు కేంద్ర ప్రభుత్వము అన్నివిధముల తూర్పు పంజాబు ప్రభుత్వమునకు తోడ్పడగలదని సర్దార్ పటేల్‌గారు హామీయిచ్చిరి.

(2వ పేజీ చూడుడు)

## సంక్షుభితప్రాంతాల్లో తిరిగిన పత్రికావిలేఖరులకథనం

### తూర్పు, పశ్చిమరాష్ట్ర ప్రభుత్వాల వ్యత్యాసవిధానాలు

లాహోరు, ఆగస్టు 31: "ఉన్నదున్నట్లు చెప్పాలంటే ఈరోజున పంజాబులో ఘోరమైన అంతర్యుద్ధం సాగుతోంది. ఇది అంతర్యుద్ధంకంటెకూడా ఘోరమైంది. ఎందుచేతనంటే ఆత్మరక్షణకవకాశంలేని నిస్సహాయులైన మైనారిటీలను భయంకర మతోన్మాదంతో అంధులైన మెజారిటీ పక్షంవారు కేవలం రాక్షసులవలె హింసిస్తున్నారు" అని ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూతో పంజాబ్ కల్లోలిత ప్రాంతాల్లో పర్యటించడానికి వెళ్లిన పత్రికా విలేఖరులు లాహోరు నుంచి పంపిన ప్రప్రథమ సంయుక్త ప్రకటనలో ఉన్నది.

ఆ ప్రకటన ఇంకా ఇల్లా తెలుపుతోంది.

"తూర్పుపంజాబ్‌లో కొత్త ప్రభుత్వం ఇంకా ఏర్పడలేదు. మతోన్మత్త ప్రజానీకమే పరిపాలన సాగిస్తూ ఉండడంవల్ల పశ్చిమ పంజాబుప్రభుత్వం శిథిలమైపోయినది. కాని తూర్పుపంజాబులో బలీయమైన కేంద్ర ప్రభుత్వం వెంటనే పరిస్థితులను అదుపులోకి తేగలిగింది, పశ్చిమ పంజాబులో మాత్రం అధికారంలోకివచ్చి 15 రోజులైనా కాని పాకిస్తాన్ ప్రభుత్వం ఏమీ చెయ్యలేకపోయింది. మతవిద్వేషాలు ప్రజల్లోనుంచి పోలీసుల్లోకి, సైన్యాలలోకిగూడా పాకిపోయింది.

ఎంత అమానుష హింసాకాండ చెలరేగినా తూర్పుపంజాబు గవర్నరు చందూలాల్ త్రివేదీ, కేంద్ర ప్రభుత్వమూ చేసిన అత్యద్భుత కృషివల్ల తూర్పు పంజాబు ఇంచుమించు ప్రశాంతమైంది. కాని పల్లెలలో ఇంకా అక్కడక్కడ భయంకరముగనే విద్వేషాలు చెలరేగుతున్నాయి.

ఒకప్పుడెంతో అందమైన లాహోరు ఈనాడు స్మశానతుల్యంగా ఉన్నది. ఎక్కడా చైతన్యమే కనిపించడమేలేదు. రక్షణశిబిరాలను బయట హిందూ సిక్కులలో మచ్చుకు ఒకరైనా కనిపించడం లేదు, ఎక్కడైనా ఉంటే వారి ముఖాల్లో శత్రువులచేత తరుమబడుతున్న పరిదీనభావం గోచరిస్తోంది."

(2-వ పేజీ చూడుడు)

## 'అల్పసంఖ్యాకులరక్షణ: లాహోరు ఒడంబడికను అమలుచేయాలి'

### పాకిస్తాన్ గవర్నర్ జనరల్ జిన్నాగారి ప్రకటన



లాహోరు, ఆగస్టు 31: పంజాబులో అమానుష చర్యలు జరుగుతున్నాయని కొన్నిరోజుల క్రితం నాకన్ని చోట్లనుంచి వార్తలు వచ్చాయి. యథార్థస్థితి తెలుసుకోవాలని లాహోరువచ్చి కనుక్కుంటే నేను విన్న వార్తలన్నీ నిజమనిపించాయి. ఈ దురంతాలను గూర్చి విన్న తర్వాత నాకు చాలా బాధకలిగింది. యుద్ధంలేకుండా శాంతియుత మార్గాన్ననుసరించి బుద్ధిబలంతో ఆమోఘమైన కార్యబలంతో మనం పోరాడినందువల్ల న్యాయమైన మన వాంఛ సఫలమైంది. ప్రపంచంలో ఎన్నడూ జరగని విధంగా మనము పాకిస్తాన్‌ను నిస్సందేహముగా సాధించాము. అయితే యిప్పుడు క్రౌర్యావేశాలకు లొంగిపోయి కసాయితనానికి దిగి రాక్షస చర్యలకు పూనుకోవడం ద్వారా ఈ మహత్తర విజయాన్ని నిష్ఫలం చేసుకోబోతున్నామా? దీనివల్ల మనకు లభించేదేమిటి?" అని పాకిస్తాన్ గవర్నర్ జనరల్ క్వాయదే అజామ్ మహమ్మదాలీ జిన్నా ఇవ్వాళ రాత్రి లాహోరు రేడియో స్టేషనులో ప్రసంగిస్తూ ఉద్ఘాటించాడు.

ఆయన ఇంకా ఇల్లా అన్నారు. "ఇప్పుడు పాకిస్థాన్, యథార్థవిషయం.

2వ పేజీచూడుడు

## డా॥ మూంజీ అరెస్టు

నాగపురము, ఆగస్టు 31: బహిరంగ సభలు జరుపరాదను ఉత్తరువు నుల్లంఘించినందులకు హిందూ మహాసభ నాయకుడగు డా॥ బి. ఎస్. మూంజీగారిని ఇంకా 8 మంది హిందూ మహాసభ కార్యకర్తలను నేటి మధ్యాహ్నము అరెస్టు చేసిరి. నేడు "లాహోరు దినము" జరుపుటకు బహిరంగ సభ జరుగునని నాగపూరు హిందూసభవారు ప్రకటించియుండిరి. ఈ సభను మ॥ రా॥ ప్రభుత్వమువారు నిషేధించియుండిరి.

## మంచూరియాలో విజయానికి చైనా ప్రభుత్వ సన్నాహాలు

నాన్‌కింగ్, ఆగస్టు 31: మంచూరియాలో విజయం పొందటానికి చైనా ప్రభుత్వం నిర్ణయించుకొన్నది. ప్రభుత్వ సేనానుల్లో అత్యంత సమర్థుడని పేరు పొందిన జనరల్ చెంగ్ చెన్‌ను, అవసరమైన సైనిక బలాలతో ముక్డెన్‌కు పంపినారు. ఇతడు ఇక్కడినుంచి కమ్యూనిస్టులను పూర్తిగా తరిమివేసే యత్నాలను చేస్తాడు. వచ్చే రెండుమూడు నెలల్లో ప్రభుత్వసేనలు ఒక దాడిని ప్రారంభించవచ్చును.

### షాంటుంగ్‌లో ప్రభుత్వ విజయాలు

షాంటుంగ్ యుద్ధరంగంలో ప్రభుత్వ సేనలు ఆక్రమించుకున్న ప్రదేశాలను చూచేందుకు చాంగ్‌కైషేక్ విమానంలో ఈవేళ బయలుదేరాడు. జింగ్‌టావోకు పడమరగా ఉన్న ప్రధాన పట్టణం చూచెంగ్‌నూ, వాయవ్యాన ఉన్న కావోమిని ప్రభుత్వసేనలు వశపరచుకున్నవి.

### డారియెన్ రేవు

"మంచూరియాలోని డారియెన్ రేవులోనికి సోవియట్ నౌకలు నిరాఘాటంగా ప్రవేశించేహక్కు ఉన్నదని సోవియట్ వార్తాసంస్థ 'టాస్' ప్రకటించుటం సబబుగాలేదు. జపాన్, యుద్ధవిరమణ ఒడంబడికకు ముందుగానే డారియెన్, పోర్టు ఆర్థర్ రేవు అధికారప్రాంతంలో వున్నదనటం 1945 సం॥ చైనా-సోవియట్ ఒడంబడికకు దురన్వయం చేయటమే. జపాన్‌తో యుద్ధం సంభవించినప్పుడే డారియెన్‌రేవుమీద ఉభయదేశాల అధికారం, ఆ ఒడంబడికవల్ల వస్తుంది" అని చైనా విదేశాంగమంత్రి ప్రకటించాడు.



## పంజాబ శాంతి స్థాపన

### భారత ప్రధాని దీక్ష

### ల్యాల్‌పూర్‌లో నెహ్రూ మహం జేతికిఆర్తస్త్రీలరక్షాబంధనం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: "పంజాబ్ రాష్ట్రంలో సంపూర్ణ ప్రశాంతి నెలకొనే వరకూ నా శక్తిసామర్థ్యాల్లో అత్యధిక భాగం ఇక్కడే వినియోగిస్తాను" అని ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూ ల్యాల్‌పూర్‌లో దాదాపు లక్షల మైనారిటీ ప్రజలు తమ్మిక్కొక్కమ్మడిగా అక్కడినుంచి మరోచోటికి పంపవలసిందని ఆయనకు విజ్ఞప్తి చేసుకోగా అక్కడ సమావేశమైన హిందూ సిక్కు ముస్లిం ప్రతినిధులతో అన్నారు.

పాకిస్థాన్ ప్రధాని లియాకత్ అలీఖాన్ కూడా ఆ సభలో ఉపన్యసిస్తూ మీరెక్కడికీ వెళ్లనవసరంలేదని విజ్ఞప్తి చేశాడు. ఆయన ముస్లింశ్రోతలనుద్దేశించి ఇల్లా అన్నారు. "మీ క్షేమం కోసమే మీరు సత్వరంగా ఈ రాష్ట్రంలో ప్రశాంత వాతావరణం నెలకొల్పాలి. లేకుంటే పాకిస్తాన్‌కే ముప్పువస్తుంది. కేవలం ప్రతీకార బుద్ధితో అమాయక ప్రజలను చంపడం ఇస్లాం సిద్ధాంతాలకే విరుద్ధము. అది మానవలోకం సహించే పనికాదు. మత విచక్షణలేకుండా సంఘంలో చట్ట విరుద్ధంగా ఎవరు ప్రవర్తించినా సరే నిర్ధా

2వ పేజీ చూడుడు

## బాధితులు స్వస్థలాలకు రాగలిగితేనే శాశ్వతశాంతిలభిస్తుంది

### ప్రార్థనసభలో గాంధీజీ ఉద్బోధ

కలకత్తా, ఆగస్టు 31: కల్లోల బాధితులు స్వస్థలాలకు తిరిగి సంకోచం లేకుండా రాగలిగినప్పుడే "శాశ్వతశాంతి సుహృద్భావాలు లభిస్తవి." అని నేటి ప్రార్థనసభలో గాంధీ హెచ్చరించారు.

బాధితుల గృహాలన్నీ బాగుచేయించటానికి, అవసరమైతే తిరిగి కట్టించటానికి ధనం కావాలని గాంధీజీ చేసిన విజ్ఞప్తి ఫలితంగా ఆయన నగరంలోని హిందూ, ముస్లిం, యూరోపియన్ ధనికులంతా గ్రాండ్ హోటలుకు ఆహ్వానించి సత్కరించారు, సమావేశం ముగిసిన తర్వాత "మీరంతా ఒక నిర్ణయానికి వచ్చినదాకా వెళ్లిపోవద్దు" అని కోరి ఆయన సుహ్రావర్దీతోపాటు బయటికి వచ్చారు. ఈ విషయాన్ని ఆయన ప్రార్థనసభలో ప్రస్తావిస్తూ ఇట్లా అన్నారు.

"బాధితులు స్వస్థలాలకు రాగలిగితేనే శాశ్వతశాంతి లభిస్తుంది. వారు అట్లా వచ్చేందుకు కావలసిన సదుపాయాలను ప్రభుత్వంకానీ, ధనికులుకానీ చేయవలసి వుంటుంది. ధనికులుచేస్తే, దానివల్ల వారు తమ పౌరులవిధిని నెరవేర్చుకొన్నవారు కావటమే కాకుండా, రెండువర్గాల మధ్యనూ వున్న సామరస్యాన్ని కూడ అది చాటుతుంది. హృదయం నిష్కల్మషంగా లేకపోతే ఎవ్వరూ ధనాన్ని ఇవ్వలేరు.

బాధితులు తిరిగివచ్చేందుకు సౌకర్యాలను చూడటానికి నియమించబడ్డ మంత్రి కమలకృష్ణరాయ్, ఇతరసహాయ పూర్తి సద్భావంతో వున్నారనీ, బాధితులుకూడ

2 వ పేజీ చూడుడు

## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ని. శ్రావణ బ॥ ద్వితీయ 1947 సం॥ సెప్టెంబరు 2 మంగళవారం

మం॥ ద్వితీయ రా 12 3 పూభా ప 10-45 వర్జ్యం రా 8.51 ల 10-32 వ.

బు॥ తృతీయ సెప్టెంబరు 3 బుధవారం

బు॥ తృతీయ రా 12 28 ఉభా ప 11 59 వర్జ్యం రా 12-27 ల 2-7 వ



ఆంధ్రపత్రిక

సర్వజిత్ సం॥ని. శ్రావ బ॥ ద్వితీయ మంగళవారము

## రాష్ట్ర ఆహార స్థితి

రాష్ట్ర ఆహార గడ్డుస్థితిని గడచుటకు అన్యుల సహాయము మీద ఆధారపడి ప్రయోజనము లేదని, స్వశక్తిమీదనే ఆధారపడ వలెనని ప్రధాని రామస్వామి రెడ్డి గారు అభిప్రాయపడుచున్నారు. గత సంవత్సరముకన్న ఈసంవత్సరము పంట అభివృద్ధికరముగ నున్నదని అధికారులు అంచనా వేసియుండిరి. వారి అంచనా సరియయినది కాదని కొందరు విమర్శించియుండిరి. ప్రధాని రెడ్డిగారు కూడ ఉత్పత్తిని గురించిన అధికారుల అంచనా కొంత ఎక్కువ అనే అభిప్రాయపడుచున్నారు. కాని ఆహారమంత్రి డా॥ రాజన్ గారుమాత్రము తగినంతధాన్యము నిలువయున్నదనియే దృఢముగ విశ్వసించుచున్నారు. సర్కారు జిల్లాలందు నిలువయున్న సరకు విడుదలైన రానున్న గడ్డుస్థితి తేలిక యగునని వారి పూర్వాభిప్రాయమును పునరుద్ఘాటించిరి. ఈ సంవత్సరపంట విషయమున అధికారుల అంచనా కొంత అతిశయోక్తితో కూడినదనిఅనుచూ, "సర్కారు జిల్లాలు ఇవ్వవలసిన ధాన్యమును ఇవ్వలేద"నుటమూలమున, సర్కారు జిల్లాలందు నిలువయున్న సరకువిషయమున ప్రధాని ఆహారమంత్రితో ఏకీభవించినట్లు స్ఫురించుచున్నది. ఈ మంత్రుల ఉభయుల అభిప్రాయములకు ఆధారము, తిరిగి అధికారుల అంచనాలే అని చెప్పవలసియున్నది.

నిలువయున్న సరకు ప్రమాణమును గురించి అభిప్రాయభేదము లుండవచ్చును. గత వారము హరిజన అభివృద్ధి శాఖా మంత్రి కూర్మయ్యగారి పర్యటన ఫలితముగా కృష్ణాజిల్లాలో 50 వేల బస్తాల ధాన్యమును ఒప్పగింత చేయుటకు రైతులు వాగ్దానము చేసియుండిరని తెలియుచున్నది. ఇది సంతోషప్రదమైన విషయమనుటకు సందేహము లేదు. ఈ సరకు కేవలము అదనముగా నిలువ చేసినసరకు అనుటకన్న ఆహార విషయమున రాష్ట్ర ప్రమాదస్థితిని గమనించి, తమ అవసరములకని నిలువచేసిన దానినుండే ఇచ్చిరని యనవచ్చును. అదీకాక ధాన్యసేకరణకు ప్రభుత్వోద్యోగుల కృషితోపాటు అనధికార ప్రముఖుల కృషి లేకపోవుట కూడ కొంత కారణమని చెప్పవలసియున్నది. మంత్రులు ఇంతకాలము కాలయాపన చేయక, ముందుగనే జిల్లాలందు పర్యటన చేసిన ఫలితములు ఇంతకన్న ప్రోత్సాహకరముగ నుండెడివనుటకు ఆధారము లేకపోలేదు. ఈ సందర్భమున నాయకులు కూడ కొంతవరకు తమ బాధ్యతను విస్మరించిరని కూడ అనవచ్చును. గతమున ఏమి జరిగినప్పటికీ, రానున్న ప్రమాదస్థితిని గమనించి, ఇకనైనను నాయకులు, రైతులు, ప్రభుత్వము పరస్పర సహకారముతో తీవ్ర కృషి చేసిన రాష్ట్రము ఈ అవాంతరమును గడువగలదని విశ్వసింప వచ్చును. ధాన్యమును తమకు తామై ఇచ్చినవారికి, బలవంతముగ అప్పచెప్పవలసినవారికి కూడ బోనసు ఇవ్వబడునని ఆహార మంత్రి తెలిపెను. దీనికి తోడుగ వ్యవసాయదారునికి బోనసు పంపబడునని, వెల్లి తెచ్చుకొన నవసరము లేదని తెలిపెను. ఈ సదుపాయములు సరకు విడుదలను ప్రోత్సహించునని నమ్ముచున్నాము. నాయకులు తాముచేయు విజ్ఞప్తులతోపాటు జిల్లాలందు పర్యటనచేసి ప్రయోజనమును సాధించెదరు గాక.

ప్రభుత్వ సేకరణ విధానము భగ్నమగుటకు, వారవలంబించిన అస్థిరవిధానము ఎక్కువ మూలమని చెప్పవలసియున్నది. ఉత్పత్తి పెరిగి సేకరణ ఫలప్రదము కావలెననిన, వ్యవసాయదారునికి క్రమమైనధర లభించునట్లుగ చూడవలసియున్నదని ప్రధాని రెడ్డిగారు అభిప్రాయపడుచున్నారు. ధాన్యపుధరను పెంచుటకు రాష్ట్రప్రభుత్వ సూచనలను, కేంద్ర ప్రభుత్వము అంగీకరించలేదు. విదేశములందు కొనుచున్న ధరను ఇక్కడి వ్యవసాయదారులకిచ్చిన ఉత్పత్తి హెచ్చుటకు ఎంతో ప్రోత్సాహకరముగ నుండునని ప్రధాని అభిప్రాయపడుచున్నాడు. అట్లయిన ఆ ధరను ఏదో రూపమున వ్యవసాయదారులకు వచ్చే సంవత్సరమైననూ అప్పచెప్పుటకు రాష్ట్ర ప్రభుత్వము ప్రయత్నించవలసియున్నది. కేంద్ర ప్రభుత్వము వినియోగదారునికి నియమించినధరకు రాష్ట్ర ప్రభుత్వము వ్యవసాయదారునికివ్వదలచినదాని వ్యత్యాసమును, సబ్సిడీమూలమున సమన్వయపరచవలసియున్నది. ఈ సందర్భమున వచ్చేసంవత్సరము పంట ధరలు నిర్ణయించుటకు ప్రభుత్వము నియమించిన కమిటీ సూచనలు ఆసక్తితో ఎదురుచూడబడును.

## తూర్పు పంజాబ్ పరిస్థితి

1-వ పేజీ తరువాయి

భారత అధినివేశ ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూగారు, పాకిస్తాన్ అధినివేశ ప్రధాని లియాకత్ ఆలీఖాన్ గారు ఆదివారము లయాల్పూరు వచ్చిరి. ఇద్దరుచేరి, విడివిడిగా కూడా వివిధ వర్గములకు చెందిన రాయబారవర్గముల కలుసుకొనిరి. "సర్ క్యాట్ హౌస్" వద్ద ఉభయులు ఒక బహిరంగ సమావేశమునందు ప్రసంగించిరి. నెహ్రూ రామస్వామి లియాకత్ పండిట్ జవహర్లాల్ గారి వద్దకు రాయబారము వచ్చిరి.

అపరాహ్ణము వీరలు లయాల్పూరునుండి బయల్దేరి ఝాంగ్, చినియట్ మీదుగ షేఖుపుర వెళ్లిరి. తిరిగి సాయంత్రము లాహోరు వెళ్లిరి.

పాకిస్తాన్ సిబ్బంది సామాగ్రిని తీసుకొని పోవుచున్న సమ్మర్జెలును ఢిల్లీకి ఇరువదిమైళ్ల దూరమందున్న బహదూర్ ఘర్ స్టేషనువద్ద ఆటకాయించి సామాగ్రిని తరలిపెట్టి ట్లు నిన్న నిచటికి వర్తమానము వచ్చినది. రైలును వెనక్కు తీసుకొని వచ్చుటకు వేరొక ఇంజనును పంపుట సాధ్యముగాక, అచటికి సైనికదళములను పంపిరి. కాని సైనికులు ఆ ప్రదేశమును చేరుసరికి వారచటినుంచి వెళ్లిపోయిరి. మరలను అప్పటి సాధ్యముకాలేదు.

శనివారము సాయంత్రము ఢిల్లీనుండి బయల్దేరిన ఫ్రాంటియరు మెయిలుకు చెందిన ఒక మొదటి తరగతి పెట్టె తగులబెట్టబడినట్లు ఖన్నానుండి ఇచటికి వార్త వచ్చెను.

లాహోరు పట్టణములోను, జిల్లాలోను, ఆదివారముకూడ పరిస్థితులు ప్రశాంతము గనే ఉన్నట్లు పశ్చిమ పంజాబు ప్రభుత్వము ప్రకటించెను. ముస్లిమేతర కాందిశీకుల ముఠాలు ఇంకను లాహోరునందు రెండు శరణార్థుల శిబిరములు ఏర్పాటు చేయబడెను. డి. ఎ. వి. కళాశాలయందు వర్తకుల నిర్వహింపబడుచున్న శరణాలయములను శీఘ్రమే ప్రభుత్వముపైన స్వాధీనము చేసుకొనిరి.

వర్తకులనుండియు, వివిధ సంఘముల నుండియు, సహాయము నర్థించుచు, సమాచారమును కోరుచు అనుదినము అనేక తంతులు, లేఖలు వచ్చుచున్న వనియు, అందువిషయమై శరణార్థులయమువారు పశ్చిమ పంజాబ్ ప్రభుత్వముతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండిరనియు వ్యక్తులకు సమాధానములు పంపుట సాధ్యము గాదనియు, వివరములు తెలిసిన వెంటనే అందుకు సంబంధించినవారికి తెలియచేయబడుననియు పాకిస్తాన్ లోని భారతడిప్యూటీ హైకమీషనరు ఒక ప్రకటన ద్వారా తెలిపెను.

పాకిస్తాన్ సైన్యములోని యూనియన్ సైనికులనుద్దేశించి సర్వసేనాని సర్ ఫ్రాంక్ మెస్సెర్వీ గారు నేడొక ఉత్తరువును ప్రకటించిరి.

"పాకిస్తాన్ అధినివేశ ప్రాంతములన్నింటి అజ్మాయిషీ అధికారములను సెప్టెంబరు 1 వ తేదీనుండి పాకిస్తాన్ సైన్యమే వహింపవలసియున్నది. పౌరపరిపాలనా శాఖ అధికారులతోను, పోలీసు సిబ్బందితోను కలిసి మనము చేయవలసిన పని అంత సంతోషప్రదమైనది కాదు. శాసన నియమములను కాపాడుటయు, రక్తపాతమును హత్యలు దోపిడి గృహదహనములను, ఇట్టి అత్యాచారములే ప్రాంతమున జరిగినను, అరికట్టుటయే మనము నిర్వహింపవలసిన కార్యము. పాకిస్తాన్ గౌరవము ఈ కార్యఫలితములపై ఆధారపడియుండును. పాకిస్తాన్ ప్రతిష్ఠ కిది అత్యంత ప్రధానమైనది. ఈ అంశమును గ్రహింపవలసినదని సైనికులందరిని కోరుచుంటిని. వారందరికి ఈ విషయమును స్పష్టము చేయదలచితిని. పరిపూర్ణమైనట్టి ప్రశాంత పరిస్థితులేర్పడు వరకు కాందిశీకులకు, రక్షణార్థులకు, ఎట్టి సహాయమును ఎంతో సహాయము చేయవలెనని సునయుందరము మనస్ఫూర్తిగ వాంఛించుచుంటిని, చేయుచుంటిని. ఎందరెందరో ముందడుగులు కిరాతులుగలరు. వీరందరిసంగతి మనము తేల్చవలసియున్నది. మొదటిరకమువారు గూండాలు, దొంగలు, బద్మాషులు. వీరు ప్రభుత్వమునకు పరమశత్రువులు. వీరిని వెంటాడి పట్టుకొనవలెను లేదా కాల్చి వేయవలెను. ఆయాకిరాతచర్యలలోవారు నిమగ్నమైయుండుటను మీరు చూచినప్పుడు చేయవలసిన పనులివి.

రెండవరకమువారు సామాన్యపౌరులు వీరు పగసాధించవలెనను భావముతో ఎదుటి వర్గమువారిపై పైశాచికచర్యలనుజరుపుచుందురు. వారు గ్రహింపజాలక పోయినను వారుకూడ ప్రభుత్వమునకు శత్రువులే. అట్టిచర్యలు జరుగకుండా చూడవలెను. అందుకెంతటి కఠినచర్యలనైన తీసుకొనవలెను. సైనికులు కాల్పులు చేయవలసి వచ్చినపుడు చంపుటకే కాల్పులు జరుపవలసియుండును. అంతకునుంచి ప్రయోజనకరమైనట్టి చర్య వేరొకటిలేదు. దౌర్జన్య చర్యల నేరముల నివారించుటతోపాటు సైనికులు 'పాకిస్తాన్ ప్రభుత్వము, గవర్నర్ జనరల్ కాయిదె-ఆజాం నిర్వచించిన సూత్రముల ప్రజాభావాభిప్రాయమును ప్రచారము చేయవలెను. క్రమబద్ధమైన పరిపాలనా నిర్వహణము కొనసాగుటకు రైల్వేలపై దాడిజరుపుట మున్నగు దౌర్జన్యాలు తీవ్ర ప్రతిబంధకములు. ఇట్టి చర్యలు జరుపువారు యుద్ధమున పంచమాంగదళము ప్రవర్తించినట్లు ప్రవర్తించిన వారగుదురు. వీరు పాకిస్తాన్ ద్రోహులు, శత్రువులు.

"చాలకాలమువరకు మన మధ్య భారత అధినివేశ దళములు కొన్ని ఉండవచ్చును. వీరిలో కొందరు ముస్లిమేతర శరణార్థులకు ధైర్యము కలిగించుటకు ఈ ప్రాంతములనుండిరి. మరికొందరు లోగడ ఏర్పాటు ప్రకారము భారతదేశమునకు తరలిపోవలసినవారు. వీరిని గౌరవించుట, ఒకే పనిలో నిమగ్నమైయున్న సాటివారివలె వారిని ఆదరాభిమానములతో చూచుట పాకిస్తాన్ సైనికులవిధి. పరుషవాక్కులవలనగాని, ఇతర విధమైన ప్రవర్తన వల్లగాని వారిమనస్సునకెట్టి కష్టము కలిగింపరాదు. భారత అధినివేశమునకు చెందిన సైనికులును అదే విధముగ ప్రవర్తింతురని మన మెరుగుదుము, అందరముకలసి మహోజ్వలమైన మహోన్నతమైన పాకిస్తాన్ స్థాపనకు కృషి చేయుదము. అరాచకమును అశాంతిని అణచి వేయుటయే మన విధ్యుక్తధర్మమును నిర్వర్తింతము. అటు పిమ్మట రక్షణార్థుల పంరక్షణను పూనుకొందము. అప్పుడు మనమావశ్యకతను అందుకు వినియోగింప వీలగును."

## విలేఖరుల కథనం

(1-వ పేజీ తరువాయి)

శాంతి భద్రతలు పూర్తిగా విచ్ఛిన్నమైపోయాయి. వేదియైన వార్తలు అవనివే చాలా కమంగా ఉంది. పైదేశంనుంచి లాహోరుకు వస్తున్న రక్షణార్థులు ఒకసు గుర్తుపోడిచే భయాన దౌర్జన్యాలు చెప్పుకుని ఏడుస్తున్నారు. వారు వచ్చివేసిన ప్రదేశాల్లో మైనారిటీలను కసాయివారికొంపలో పశువులను నరికి వేసినట్లు ముక్కలు ముక్కలు చేస్తున్నారట. తూర్పు పంజాబుకు రక్షణార్థులు చేరవేస్తున్న రకుల పైన్యాలను పట్టుకించి అడ్డగిస్తున్నారట వీరికి పోలీసులుగూడా సహాయం చేస్తున్నారట. ఈ విషయాలలో ఎంత అతిశయోక్తి ఉన్నా సూరు వర్తమానం వచ్చిన వర్గాల నిజాయితీనిబట్టి ఉన్న యథార్థమే చాలా భయంకరంగా ఉన్నదని మాకు నమ్మకం కలిగింది.

షేఖుపూరాలో రెండురోజుల్లో జరిగిన హత్యలు వేలసంఖ్యను మించిపోయాయి. మైనారిటీసంఘాల మొరలను పోలీసులుగాని, పాకిస్థాన్ సైన్యాలుగాని ఎంతమాత్రమూ వినిపించుకోక పోవడమే కాక ముస్లిం దౌర్జన్యాల్లో సహాయపడుతున్నారని ప్రతివారూ ఫిర్యాదుచెయ్యడం మొదలు పెట్టారు.

సరిహద్దుసైన్యం అసమర్థత విషయమై హిందూ ముస్లింవర్గాలు ఏకగ్రీవంగా ప్రకటించాయి.

తూర్పుపంజాబ్ లో ఇండియా సైన్యాలు సాయుధప్రజల ముఠాలను నిర్దాక్షిణ్యంగా తుపాకులతో కాల్చి అణచివేసిన నిదర్శనాలు ఎన్నో ఉన్నాయి. ఈవిధంగా ఇక్కడి పరిస్థితి పూర్తిగా అదుపులోకి వచ్చింది.

## పశ్చిమ పంజాబ్ భయంకర పరిస్థితి

ఇండియా రక్షణ మంత్రి బలదేవుసింగు, పాకిస్థాన్ రవాణామంత్రి సర్దార్ అబ్దుర్ రాబ్ నిష్టర్ గార్లతో పశ్చిమ పంజాబ్ పర్యటనకు వెళ్లిన ఇద్దరు పత్రికా విలేఖరులు ఈ క్రింది సంయుక్త ప్రకటన చంపారు.

"లాహోరునుండి సయాల్ కోటవరకూ, ఆపైన పస్రూర్ వరకూ దాదాపు నూరు మైళ్లదూరం మేము మోటారులో ప్రయాణం చేశాము. మా వెంబడి కాలుగు జీపుల నిండా సైనికులు వచ్చారు. ఈట్రునీ రోడ్డు మీదుగా ప్రయాణం చేస్తుంటే ఎక్కడా జన సంచారమే కనిపించలేదు. చుట్టుప్రక్కల ప్రదేశాలన్నీ నిర్జనంగా ఉన్నాయి.

గుజరన్ వాలా వెళ్లాక కొంత చైతన్యం కనిపించింది. అక్కడ ముస్లింలు మావంక అనుమానంతో చూచారు. హిందూ సిక్కులందరూ తమతమ గృహాలువిడిచి గురుద్వారాల్లో, ఖిల్లా పాఠశాలల్లో తలదాచుకుంటున్నారు. రక్షణ శిబిరాల్లో జనం కిక్కిరిసి ఉన్నారు. చుట్టు ప్రక్కల ఊళ్లనుంచీ మహమ్మదీయేతరు లందరూ శిబిరాల్లో చేరిపోయారు. వారికి తగిన ఆహారం లభించడంలేదు. ఇండియా ప్రభుత్వం ఉచితంగా రేషను ఇవ్వాలని చేసిన నిర్ణయం ఇంకా వారి కందక పోబట్టి ఇప్పటికీ వారికి అధికారులు రేషనివ్వడంలేదు.

గుజరన్ వాలా దాటి డాస్కా వచ్చాము. ఇక్కడ సిక్కు హిందూ జనాభాయే ఎక్కువ అయితే ఏం, కట్టు గుడ్డతో రోడ్డుపక్క గుక్క తెలియక పడి ఉన్న 6000 మంది శరణార్థులను మేము చూచాము. వారిలో చాలామంది అక్కడకు వచ్చి రెండుగంటలన్నా అయిఉండదు. తమ తమ ఊళ్లల్లో జరుగుతున్న ఘోరమంతా జ్ఞాపకమువచ్చి వాళ్లు చెప్పు చే మా శరీరాలు భయతో కంపించిపోయాయి. ఇళ్లు తగలపెట్టడం, ఆస్తులను దోపిడీ చెయ్యడం, బాలికల మానభంగం, నిర్బంధమతాంతరీకరణం, ఇది సామాన్యమైపోయింది. పోలీసులుగూడా ముస్లింలను అణచడంమాని వారితోపాటు దౌర్జన్యాలు చేస్తున్నారట. ఎక్కడవిన్నా ఇదే మాట.

సయాల్ కోటవద్ద పరిస్థితులు మరీ భయంకరంగా ఉన్నాయి. అక్కడనుంచి చాలామంది హిందూ సిక్కు ప్రజలు జమ్మూ సంస్థానానికి పారిపోయారు. ఏమైనాసరే మమ్మల్ని తూర్పుపంజాబ్ కు పంపించివెయ్యండి అని ప్రతివారూ బలదేవుసింగుకు విన్నపం చేసుకున్నారు.

మేము చూచిన ప్రతిరక్షణ శిబిరంలోనూ బలదేవుసింగు స్థైర్యంచెప్పి రక్షణార్థుల సంరక్షణకై అన్నిసన్నాహాలూ చేస్తున్నామనీ, కొంచెం ఓపిక పట్టాలసిందనీ, ఇకనుంచీ మహమ్మదీయేతర సైన్యాలే వారి రక్షణకు నియమింపబడతాయనీ హామీ ఇచ్చారు.

## గాంధిజీ ఉద్బోధ

(1-వ పేజీ తరువాయి)

స్వస్థలాలకు రావటానికి సిద్ధపడినవ్వారనీ, చెప్పినప్పుడు చాలసంతోషించాను. కాని వారి జీవనాధిగా వున్న ఫ్యాక్టరీలు ఇంకాపనిచేయకపోవటం చాలఇబ్బందిగా వున్నది

సద్భావానికి కృషి.

ఈ ప్రాంతపు ఎన్నవ ముస్లింలు శాంతి కోసం ఉద్యమం చేయుచున్నారని తెలిసినది. ఒకవేళ నిజమైతే, కలకత్తాఅంతటా దీనిని తప్పకుండా అనుసరిస్తారు. నేను మంగళవారంనాడు నవకాళి వెడతాను. కాని ఇక్కడ ఎక్కువరోజులు ఉండను. ఇక్కడ ప్రారంభించినపనిని పూర్తిచేసేందుకు త్వరలో నేతిరిగివస్తాను. ఈలోపుగా కొండరపలను తిరిగిరప్పించే ఏర్పాట్లు చురుకుగా సాగిపోవాలి. శాశ్వతశాంతికి అదిఒక్కటే మార్గం."

గాంధీజీచెప్పిన ప్రాంతం బాగ్ మారి. ఇక్కడ ముస్లింలు అధికసంఖ్యాకులు, హిందువులంతా పారిపోయినారు.

గాంధీజీతరవాత సుహ్రావర్ది ప్రసంగిస్తూ, "దేశంలోని ఇతరప్రాంతాల వార్తలను లక్ష్యంచేసి ఉద్రేకంచెందవద్దు. మన ప్రాంతాల్లో నైనా శాంతిని కాపాడాలి" అని అన్నాడు.

## జిన్నాగారి ప్రకటన

[1-వ పేజీ తరువాయి]

అది ఎన్నటికీ శాశ్వతంకాదు. అదే కాక అతిక్లిష్టమయిన భారతరాజకీయ సమస్యకు ఇదొక్కటే న్యాయసంతమైన అన్ని పక్షాలకూ గౌరవహేతువైన ప్రత్యక్షపరిష్కారం."

## సరిహద్దు సంఘ నిర్ణయం

సరిహద్దు సంఘనిర్ణయం అన్యాయం, అపసవ్యం, అక్రమం, అయినప్పటికీ మనం దానికి బద్ధులమవుతామని మాట ఇచ్చాము. అందుచేత గౌరవనీయ ప్రజలవలె మనం దానికి బద్ధులం కావాలి. భారత విభజన ఈ నాటికి సిద్ధించింది. మహోన్నత స్వతంత్ర ముస్లింరాజ్యమైన ఈ పాకిస్థాన్ ను నిర్మించడంలో మనకెన్నో అన్యాయాలు జరిగాయి. అన్నింటితోపాటు ఇదికూడా మరొకదెబ్బ. దీన్ని కూడా మనం ధైర్యంతో, ఓర్పుతో సహించాలి.

ఇప్పుడు మనం పాకిస్థాన్ పురోభివృద్ధికి పూనుకోవాలి. ఇది ప్రపంచస్వతంత్ర రాజ్యాలలో అన్నింటికన్నా పెద్దది. ప్రపంచస్వతంత్ర రాజ్యాలలో అయిదవది. ముసల్మాను స్త్రీ పురుషులలో ప్రతి వ్యక్తి నిరంతరకృషిచేసి ఈ రాజ్యాన్ని ప్రపంచంలో అత్యున్నత రాజ్యంగా చెయ్యడానికి తగినతరుణమిది. ఇదేవారికి మహావకాశం. అల్లాదయవల్ల మనకు పరిపూర్ణ శక్తి చాలా ఉంది. మన ప్రజల కందరకూ అనంతమైన సామర్థ్యం ఉంది. వీటిని ఉపయోగించి మన రాజ్యాన్ని గొప్పదిగా చెయ్యడం మన చేతుల్లో పని.

## శాంతి స్థాపనకై ఇండియా పాకిస్థాన్ల కృషి

దేశంలో శాంతిస్థాపన చెయ్యడం ఆవశ్యక కర్తవ్యమని అన్ని పక్షాలవారూ గుర్తించారు. ఆగస్టు 29 న ప్రత్యేక సమావేశంలో మైనారిటీ రక్షణకై అందరూ పూనిన ప్రతిజ్ఞను చెల్లించి వెంటనే శాంతి స్థాపన చెయ్యవలసిన బాధ్యత అన్నివర్గాల నాయకులపైనా వారి అనుచరులపైనా ఉన్నది. అనాటి లాహోరు సమావేశంలో ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వాలు రెండూ ఈ ఉభయ సిద్ధికై కొన్ని మార్గాలు నిర్ణయించుకున్నాయి. ఇప్పుడు అరాజకం పంజాబ్ పల్లెలలోకి గూడా ప్రాకిపోయింది కాబట్టి పరిమిత ప్రాంతాలకు నియమించిన సరిహద్దు సైన్యం ప్రాప్తిపు పంజాబ్ల సంరక్షణకు సమర్థం కాదని దాన్ని రద్దుచేశాము.

ఉభయ ప్రభుత్వాలూ కలిసి చేసిన ఈ నిర్ణయాలను బట్టి దేశంలో చెలరేగిన అల్లకల్లోలాన్ని అణచడానికి ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వాలు రెండూ దృఢంగా తలపడినవని వివిధవర్గాల ప్రజలూ గుర్తించాలి. ఇప్పటికే విపరీతంగా ప్రాణనష్టమూ, ధననష్టమూ జరిగింది. అనేకవేల ప్రజలు తలదాచుకునే చోటులేక తిండిలేక అల్లాడిపోతున్నారు. ఇంతటి అశాంతికి కారకమైన తమ తెలివితక్కువను అన్నివర్గాలవారూ గుర్తించాలి.

అసలు ఈ విద్వేషాలకు ఏ మతవర్గ ప్రథమ హేతువో, ఏది తన చేష్టలచేత తనకుతాను మరింత అపఖ్యాతి తెచ్చుకున్నదో చెప్పడానికి ఇదికాదు సమయం. భావి చరిత్రకారులు ఈ విషయంలో తమ నిర్ణయం తెలుపవలసివున్నది. ప్రపంచంలో మానవసంఘం యావత్తూ ఈ దురంతాలను అసహ్యించుకుంటోంది. నాగరిక ప్రపంచ దృష్టిలో ఈ భయంకర పైశాచిక చేష్టల ఫలితంగ మతసంఘాలు అపఖ్యాతి పాలయాయి.

## పాకిస్థాన్ ప్రజలకు సందేశం

ఇప్పుడు శాంతిస్థాపన చెయ్యవలసిన బాధ్యత ప్రభుత్వాధికారం వహించిన నాయకులపై ఉన్నది. ఆకాశం కాలమేఘావృతమై ఉండగా పాకిస్థాన్ ప్రజలకు నేను సందేశం ద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను.

ఆత్మస్థైర్యం పెంపొందించండి. నిరాటంకంగా మీ పనిలో మీరు సంపాదన సాగించండి. ధైర్యసాహసాలతో మన ఆదర్శం మనం సాధించగలం. మనం నిరుత్సాహ పడుతున్నామా? ఎన్నటికీ లేదు. ఇస్లాం చరిత్రలో స్పెయిన్ లో ఈ జాతి అనేకాపదల్ని సాధించిన నిదర్శనాలు ఎన్నో కనిపిస్తాయి. అందుచేత అవరోధాలు ఎదుర్కొని వ్యాకులపడక పురోగమించండి. ఇంతి మహోత్తమ నాగరకతతో ఇంతటి అద్భుత చరిత్రతో పదికోట్లున్న, 7 కోట్ల ప్రజలుగల జాతి దేనికీ భయపడవలసిన అవసరంలేదు. ఇప్పుడు మనకు వీనులారచూచినా కావలసినంత పని ఉంది. మనం తప్పక విజయం పొందితీరతాము. కాని 'ఐక్యత, క్రమశిక్షణ, విశ్వాసం' అనే మన ఆదర్శం వాన్ని మాత్రం మరవవద్దు."

## తూర్పుపంజాబ్ ముస్లిం శరణార్థులు

లాహోర్, ఆగస్టు 31: పాకిస్థాన్ ప్రభుత్వం తివాళా తీసినాపరే తూర్పు పంజాబ్ నుంచి వస్తున్న ముస్లిం శరణార్థులకు వసతి సౌకర్యాలు చూపిస్తుందని పశ్చిమ పంజాబు లీగు శాసనసభ్యులకు జిన్నా హామీఇచ్చారు. అయినప్పటికీ పెద్ద ఎత్తున జనాభామార్పిడు ఆయన అంగీకరించలేదు. తమ తమ స్వస్థలాల్లో అంటిపెట్టుకుని ఉండగలిగిన వాళ్లు అక్కడనే ఉండిపోవాలని ఆయన సలహా ఇచ్చాడు.

"కష్టసమయాల్లో ముస్లింలను రక్షించేందుకు అల్లాకృపవల్ల ఇప్పుడు పాకిస్థాన్ లభించిందని ముస్లింలందరూ భావించాలి" అని పశ్చిమపంజాబు అసెంబ్లీ ముస్లింలీగు పార్టీ సమావేశంలో జనాబు జిన్నా అన్నాడు.

## భారత ప్రధాని దీక్ష

1-వ పేజీ తరువాయి

తీవ్రంగా శిక్షించవలసిందని నేను జిల్లా మేజస్ట్రేట్లకు ఆదేశించాను" ఈ ప్రకటనసభలో మహమ్మదీయేతరులు హర్షధ్వానాలు చేశారు.

ఉభయ ప్రధానులూ ఇవ్వాళ కూడా షేఖుపురా వెళ్ళి వచ్చారు. అక్కడ స్త్రీలనూ, పురుషులనూ, పిల్లలనూ ఎత మాత్రమూ కనికారంలేకుండా దారుణంగా చిత్రవధ చేస్తున్నారు.

అమృతసర్ నుండి ఉదయమే బయలుదేరి ఉభయ ప్రధానులూ తమ సహచరులతో విమానంపై అమృతసర్ వెళ్లారు. విమానంలోంచి చూస్తూ ఉంటే ఆయా ప్రాంతాల్లో హిందూ ముస్లిం సిక్కు సంఘాలు సామరస్యంతో ప్రవర్తించి పరిస్థితులను ఎంత అభివృద్ధిలోకి తెచ్చారో అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ల్యాల్ పూర్ పరిస్థితిని దీనితో పోల్చిచూచి అక్కడకూడా ఇటువంటి మార్పు తేవడానికి ఏవిధంగా వీలవుతుందో ఆలోచించడానికే ఈ ప్రయాణం ఏర్పాటు చేశారు.

ల్యాల్ పూర్ విమానా శ్రయంలో దిగడంతోనే జిల్లా కమిషనర్ డిప్యూటీ కమిషనరు అవచ్చి ఆ జిల్లాలో ఎక్కడా కల్లోలాలు లేనేలేవని ప్రధానులకు తెలియజేశారు. కాని రక్షణార్థులు విరివిగా వస్తున్నందుకల్ల ప్రజల్లో భయం ఇంకా కనిపిస్తోందని వారు అన్నారు. ఈ పర్యటనసంఘం విడిచి గృహాలకేగచ్చేటప్పటికి తమ తమ అభిప్రాయాలు తెలుపుకుకేందుకు అనుమతించవలసిందని చాలామంది కోరారు.

హిందూ సిక్కుల తరఫున వక్తలైన వారందరూ మామూలుగా అన్నిచోట్ల వినిపించిన కథనే వీరూ వినిపించారు. స్థానికాధికారులు తమ శక్తివంచన లేకుండా శాంతిస్థాపనకై కృషిచేస్తున్నారు స్థానిక ముస్లింలీగు నాయకులు కూడా వీరి కృషితో సహకరిస్తున్నారు. అయినప్పటికీ దురాత్ములు విచారకరకృత్యాలు చేస్తున్నారనీ అటువంటివారు ఎక్కువగా ముస్లిం జాతీయరక్షకదళాలేననీ వారు అన్నారు. ల్యాల్ పూర్ లో కొన్ని ఇళ్లకు కాల్చి లాటీలు చేశారు.

తమకున్న సర్వస్వాన్ని కోల్పోయిన జనసమూహం స్త్రీలు నెహ్రూగారిదగ్గరకు వచ్చి తమ దుస్థితిని తెలుపుకుని దుఃఖిస్తుంటే చుట్టుప్రక్కల ఉన్న వారి హృదయాలు ద్రవించిపోయాయి. కన్నీళ్లు కార్చనూ దయనీయమూ రుద్ధమైన అనుమంగళులు తమ రక్షణకై ఇంతశ్రేమపడుతున్న పండిట్ నెహ్రూను ముందికి ఈనాడు రక్షాబంధనమునాడు చేత రక్షాసూత్రం కట్టారు. పండిట్ నెహ్రూ హృదయం ఈ సన్నివేశంలో పరిపూర్ణమై ఆయన కళ్లవెంటకూడా నీళ్లు కారాయి. ఈ మతకలహాలవల్ల బాధితులైన ప్రజలందరినీ తన సర్వశక్తులూ ఉపయోగించి రక్షిస్తానని ఆయన వారికి వాగ్దానం చేశారు.

## గ్రీస్ కొత్త ప్రధాని విజ్ఞప్తి

ఏథెన్స్, ఆగస్టు 31 : ఇదివరకు విదేశాంగశాఖ మంత్రిగావుండి, రెండురోజుల క్రితమే ప్రధానమంత్రిత్వం వహించిన సొకద్దారిసు, ట్సల్దారిస్, సర్వసభ ప్రభుత్వ మేర్పడి, జాతీయైక్యత జరుపవలెనని విజ్ఞప్తిచేసెను. గ్రీస్ గోల్లాలను ... గ్రీస్ స్వాతంత్ర్యమును నిలబెటగలమని ఈయన శపథంచేశాడు. ప్రభుత్వోద్యోగులలో ద్రోహులను, హద్దుమీరేయువారిని అణచివేసెదము నిశ్చయము అని ఈయన అన్నాడు

అల్బేనియా-గ్రీస్ సరిహద్దులను భగ్నపరచిన గ్రీస్ తిరుగుబాటుదారులను జరిపెనని అల్బేనియా ప్రభుత్వం ప్రకటించినది.

## డాలరు కరువు చర్చించుటకు సామ్రాజ్యదేశముల సమావేశం

కాంబెర్రా, ఆగస్టు 31 : సెప్టెంబరు 11 వ తేదీన జరుగనున్న అంతర్జాతీయ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి వార్షిక సమావేశములకు ఆస్ట్రేలియా ప్రతినిధులుగా లండనులోని ఆస్ట్రేలియన్ హైకమీషనర్ జాన్ బీస్లీ; ఆస్ట్రేలియన్ ప్రభుత్వ ఆర్థిక సలహాదారు బ్రిడ్జెన్ గార్లు హాజరగుదురు.

డాలరు కరువునుగూర్చి సంప్రదింపులు జరుపుటకు అదేసమయంలో సమావేశం కానున్న సామ్రాజ్యదేశముల సమావేశములో వీరు హాజరుకాగలరు. సామ్రాజ్యదేశము లన్నియూ డాలర్ దిగుమతులు తగ్గించుకొనవలెనని బ్రిటన్ కోరగలదని వీరు భావించుచున్నారు. అంతర్జాతీయ ద్రవ్యనిధిలో బ్రిటన్ కోటా 65 కోట్ల డాలర్లు. ఈ నిధి డాలరు కరువును తీర్చుటకు ఏమాత్రము సరిపోదని అందరికీ తెలిసిన విషయమే. కాబట్టి ప్రతిదేశము డాలరు ప్రాంతమునుండి తన దిగుమతులు, ఎగుమతులకు సరిపోవునట్లు చూచుకొనవలెను.

సామ్రాజ్యములోని దేశములన్నియూ ఈ సమావేశములో పాల్గొనుటకు అంగీకరించినట్లు తెలియుచున్నది. అంతర్జాతీయ ద్రవ్యనిధి సమావేశములకు వచ్చిన తదితర పక్షముల, ముఖ్యముగా అమెరికన్ ప్రతినిధులు ఈ సమావేశముపట్ల అపోహ పడెదరేమోనని భయపడుచున్నారు.

సెప్టెంబరు 10 వ తేదీనుండి జరుగు అంతర్జాతీయ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సమావేశములు, బ్రిటిషు సామ్రాజ్యదేశముల సమావేశములు జరిగిన తరువాత ఆర్థిక విపత్తును గడచుటకు ఈ సమావేశములుచేయు సూచనలు, ఏర్పాటులు గమనించి, బ్రిటిష్ ఆంగ్లో-అమెరికన్ సంప్రదింపులు తిరిగి ప్రారంభం చేయగలదని రాయిటర్ విలేఖరి వ్రాస్తున్నాడు.

## 'ధాన్యసేకరణ తీవ్రతరం కావాలి'

డా॥ రాజన్ అభిప్రాయం

చెన్నపట్నం, సెప్టెంబరు 1 : "ఈ నెలాఖరు లోపున ఇప్పుడు ఉన్న లక్ష 70 వేల టన్నుల ధాన్యానికి తోడు మరో లక్ష 70 వేల టన్నుల ధాన్యంవస్తేనే గండం గడుస్తుంది" అని ఆహారశాఖా మంత్రి డా॥ రాజన్ గారు నేడు పత్రికా ప్రతినిధులతో ప్రస్తావించుచూ చెప్పిరి.

రాష్ట్ర ఆహారస్థితిని గూర్చి ఇప్పుడు తామేమియు చెప్పవగిన స్థితిలో లేమనియు, ఒక వారంలోపలో కలెక్టర్ల దగ్గర నుంచి తమకు నివేదికలు పూర్తిగా అందవలసియున్నది. డా॥ రాజేంద్ర ప్రసాదుగారు తమకు జాబువ్రాసెనని కూ, ఇదివరకు పంపిన 7 వేల టన్నులకు తోడు మరొక 7 వేల టన్నుల ధాన్యమును పంపగలరని అందులో తెలిపెనని.

కృష్ణాజిల్లాలో వరదలవల్ల పంటలు నష్టమును గూర్చి మంత్రిగారికి నివేదిక లేమియు వచ్చినవా అని అధికారులు తమ కేమియు రాలేదనియు తెలిపిరి. మంత్రి సర్కారు జిల్లాలలో పర్యటనము చేసిరా అనగా తాము సంచారము చేసినచో ఏమైనా గింజలు లభించిన, ఎప్పటనైనా సంచారము చేసెదమనియు ఇప్పుడు రాయలసీమ మండలములకు వెళ్లుచున్నామనియు చెప్పిరి.

ధాన్యసేకరణ ఇంతవరకూ తృప్తికరముగా జరగలేదనియు, 23 వేల టన్నులు ఒకమాసములో వచ్చినప్పుడు అది బోనసువల్ల వచ్చినదనియు, మంచి తరుణములో, ఇప్పుడు ధాన్యమును సేకరింపవలెననియు తెలిపిరి.

నిల్వలఅంచనాలగూర్చి అధికారులసంఖ్య లెక్కలకొంత అతిశయముగా ఉన్నవని ప్రధాని తెలిపిన విషయమై వారు తెలిపినదానికి తాము పూర్వపక్షము చెప్పబోవుటలేదనిరి.

ప్రధానమంత్రి ధాన్యసేకరణను గూర్చి 2-వ తేదీవరకు తంజావూరు మండలము, రెవిన్యూమంత్రి కళా వెంకట్రావుగారు 4,5 తేదీలలో నెల్లూరు మండలములందును పర్యటించుచున్నారు.

## పశ్చిమ బెంగాలులో ఇండియా కాలప్రమాణం

కలకత్తా, సెప్టెంబరు 1 : ఆగస్టు 31 అర్ధరాత్రి దాటిన తర్వాతనుంచి పశ్చిమ బెంగాలులో భారత కాలప్రమాణం అమలులోకివచ్చింది. తక్కిన ఇండియా యూనియన్ లో అమలులో ఉన్న కాలప్రమాణాన్నే అనుసరించాలని పశ్చిమ బెంగాలు ప్రభుత్వంచేసిన నిర్ణయానికి అనుగుణంగా ఈమార్పు వచ్చింది.

ఇంతకుముందు అక్కడి బెంగాలు కాలప్రమాణం అమలులోఉండేది ఇండియాలో 8 అయితే అక్కడ 9 గం. లయ్యేది. ఇప్పుడు అక్కడకూడా 8 గం. టలే అవుతుంది.





1. రాజ్యాంగపరిషత్సభాభవనంలో గాంధీజీ చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ, అధ్యక్షుడు రాజేంద్రబాబు మహాత్ముని దేశసేవకు జోహార్లర్పిస్తున్న దృశ్యం.
2. రాజకుమారి అమృతకౌర్, మౌంట్‌బాటెన్ సతీమణి ఆగస్టు 28 తేదీన గుజ్రన్‌వాలా వెళ్ళినప్పుడు సిక్ శరణార్థి శిబిరంలోని వారి నుద్దేశించి అమృతకౌర్ ఉపన్యసిస్తున్న దృశ్యం.

# బాధ్యతాయుత ప్రభుత్వ నిర్మాణానికి మైసూరుప్రభుత్వ ఆలోచన

## ప్రభుత్వసలహాసంఘ కార్యక్రమం

### సత్యాగ్రహసమరాన్ని సాగించుటకు సంస్థాన కాంగ్రెస్ నిర్ణయం

బెంగుళూరు, ఆగస్టు 31: మైసూరులో రాజ్యాంగ సంస్కరణలను సత్వరంగా ప్రవేశపెట్టటానికి మైసూరు ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. దివానుకు సంస్కరణల మీద సలహాను ఇచ్చే సంఘం రాబోయే సమావేశంలో చర్చించే అంశాలను ప్రభుత్వం ప్రకటించింది.

"బాధ్యతాయుత ప్రభుత్వాన్ని వెంటనే నిర్మించాలన్న ప్రజల కోరికను ప్రభుత్వం గమనించినది. ఈ బాధ్యతాయుత ప్రభుత్వం, బ్రిటిషు ప్రభుత్వం మోస్తరుగా ఏకపక్ష ప్రభుత్వంగా వుండవలెనా లేక ఇంకోవిధంగా ఉండవలెనా అనే విషయాన్ని సలహాసంఘం చర్చిస్తుంది. శాసనసభా స్వరూపస్వభావాలు, వోట్ల అర్హత, వోట్లువేసే పద్ధతి మొదలైన విషయాలన్నిటినీ ఈ సంఘం చర్చిస్తుంది." అని ఆ అజెండాలో వున్నది. ఈసలహాసంఘాన్ని సంస్థాన కాంగ్రెసు బహిష్కరించింది.

**కాంగ్రెసు నిర్ణయము**

"బాధ్యతాయుత ప్రభుత్వాన్ని నిర్మిస్తూ మహారాజా ప్రకటనచేస్తేనే తప్ప, సెప్టెంబరు 1 వ తేదీ నుండి సంస్థాన కాంగ్రెసు సత్యాగ్రహాన్ని జరిపి తీరుతుంది." అని సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడు కె. చెంగలరాయరెడ్డి ప్రకటించారు. ఈయన పదిరోజులనుంచి సంస్థానమంతా ప్రచారంచేసి వచ్చాడు.

"దివాన్ ఏర్పరచిన సలహాసంఘం స్థానంలో శాసనసభ ఎన్నుకొన్నటువంటి ప్రజాపరిషత్ ఉండాలి. శాసనసభ విశ్వాసాన్ని పొందిన తాత్కాలిక ప్రభుత్వాన్ని తక్షణం నిర్మించాలి. ఈ మూడు పనులూ జరగకపోతే సత్యాగ్రహం తప్పదు."

**కార్యక్రమం**

సత్యాగ్రహం మొదటిరోజున ప్రభాతభేరీలు, బహిరంగసభలూ, నిర్దేశించబడ్డవి. హర్తాల్ యథేచ్ఛగా జరపవలసినదని విజ్ఞప్తి చేయబడ్డది.

**పత్రికల ప్రయత్నం**

నగరంలోని ప్రధానపత్రికలంతా దివాను కూ కాంగ్రెస్ అధ్యక్షుడికీ రాజీకుదర్చాలని చూస్తున్నారు. వీరు దివాన్‌ను కలుసుకుని సంభాషణ ఫలితాలను అధ్యక్షుడికి ఎరిగించారు. ఈ క్లిష్టపరిస్థితుల్లో సత్యాగ్రహాన్ని త్వరపడి ప్రారంభించవద్దని ఆయనను విజ్ఞప్తిచేశారు.

**హిందూమహాసభ నాయకుని విజ్ఞప్తి**

సంస్థాన హిందూమహాసభ నాయకుడు భూపాలచంద్రశేఖరయ్యగారు ఈ క్రింది విజ్ఞప్తిని చేశారు: సలహాసంఘపు అజెండా ప్రభుత్వపు సదుద్దేశాన్ని తెలియజేస్తున్నది. కాబట్టి కాంగ్రెసు నాయకులు, కేవలం ప్రతిష్ఠనే చూసుకోకుండా, దివాన్‌తో సంప్రతించటం మంచిది. బ్రిటిషు ఇండియాలో నిరంకుశ రాజప్రతినిధి, ఒకరోజులో ప్రజాసేవకుడైన గవర్నర్ జనరల్ అయినాడు. పండిత నెహ్రూ ప్రధాని అయినాడు. అదేవిధంగా ఇక్కడ దివాన్ కూడా మహారాజు సలహాదారుగా ఉండి, కాంగ్రెస్ నాయకుడు ప్రధాని కావచ్చును."

**ముస్లిముల కేటాయింపు**

గత వారాంతంలో సంస్థాన ముస్లింలీగు కార్యవర్గం సమావేశమై ఈ క్రింది రీతిగా నిర్ణయించింది: పురోభివృద్ధికి మేము వ్యతిరేకులము కాము. కాని ప్రస్తుత ఆహారకాటకంలో సత్యాగ్రహంచేసి కాంగ్రెసు పరిస్థితులను ఇరుకున పెట్టకూడదు. సంస్థానంలో ముస్లింలంతా ఈ ఉద్యమంలో పాల్గొనకూడదు.

# పాకిస్థాన్‌లో శాంతి రక్షణ అత్యవసరము

## ఖ్వాజానాజిముద్దీన్ ఉద్బోధ

ఢాకా, ఆగస్టు 31: 'పాకిస్థానులో శాంతిరక్షణ అత్యవసరమని మహమ్మదీయులు గ్రహించవలెను. బౌండరీ కమిషను తీర్పు మనవారి కెంత దుఃఖము కలిగించినను పాకిస్థాను శ్రేయస్సుకుగాను పాకిస్థానులో శాంతిరక్షణ అవశ్య కర్తవ్యమని జిన్నాగారు గావించిన ఆదేశమును వారు పాలించవలెను' అని తూర్పు బెంగాల్ ప్రధాని ఖ్వాజానాజిముద్దీన్‌గారు ఒక ప్రకటనలో విజ్ఞప్తి గావించుచున్నారు.

పాకిస్థాను రాజధానియగు కరాచీలో బౌండరీ కమిషను తీర్పువల్ల యేర్పడిన పరిస్థితి తాను జిన్నాగారితోను, ప్రధాని లియాకత్ ఆలీఖాన్‌గారితోను చర్చించెనని ఆయన చెప్పుచున్నారు. ఈ తీర్పు ఎంత అన్యాయమైనను, కమిషను విచారింపవలసిన అంశములకు యెంత విరుద్ధమైనను భారతస్వాతంత్ర్యచట్టము ననుసరించి అది ఖాయమైనదని, రెండు అధినివేశ ప్రభుత్వములు అంగీకారముపైగాని దానిని మార్చ వీలులేదని చెప్పుచున్నారు. (అ. ప్రె.)

# అధికోత్పత్తి చెయ్యకపోతే ఆర్థికశైథిల్యం తప్పదు

## కార్మిక ప్రజాలోకానికి శ్యాంప్రసాద్ విజ్ఞప్తి

కలకత్తా, సెప్టెంబరు 1: ఇండియాను భయపెడుతున్న ఆర్థిక వ్యవస్థా శైథిల్యం నివారించాలంటే పారిశ్రామికులూ, కార్మికులూ సహకరించి అధికోత్పత్తి చెయ్యడమే శరణ్యమని భారత పరిశ్రమల మంత్రి డా॥ శ్యాంప్రసాద్ ముఖర్జీ ఇవ్వాళ కలకత్తాలో వివిధ వ్యాపార సంస్థల సమావేశంలో హెచ్చరించారు.

'ఈనాడు అసలు సమస్య ఇండియాలో నిరుపేద ప్రజలకు అన్నవస్త్రాలు అందించడమే! అది జరగనంత కాలం స్వాతంత్ర్యంతో అసలు ప్రసక్తి లేదు. అందుచేత అధికోత్పత్తి, సరియైన పంపకం ఇవి రెండే ఈనాడు మనం చెయ్యవలసిన పనులు' అని కూడా ఆయన అన్నాడు.

ఈనాడు ఉత్పత్తి మందగించడానికి ముడిపదార్థాల లోపమూ, కార్మికుల్లో అశాంతీ, కొన్నిచోట్ల శ్రామికులు మందకొడిగా పనిచెయ్యడమూ ఇవే కారణాలని ఆయన అన్నారు. రవాణా సౌకర్యాలు సరిగా లేనందువల్ల పరిశ్రమలకు బొగ్గుకూడా సరిగా సప్లై కావడంలేదు.

వస్త్రసమస్య విషయంలో రాత్రిళ్లు పనిచెయ్యడానికి కార్మికులు అంగీకరించుటలేదు. యంత్రాలూ సరిగాలేవు. కంట్రోళ్లు ఎత్తివెయ్యాలని కొందరంటున్నారుగాని జనసామాన్యం వాటిని కోరుతోంది. ఈనాడు యజమానులూ, కార్మికులూ సర్వప్రజలూకూడా ఈ ప్రభుత్వం మనదేనని స్మరించి దానితో సహకరించి ఇతోధికంగా శ్రమించి ఈ గడ్డురోజులు దాటించాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

**శ్రీ కళా వెంకట్రావుగారిసంచారం**

రివిన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు, 4 వ తేదీ ఉదయం ఢిల్లీ ఎక్స్‌ప్రెసులో మదరాసు విడిచి 12 గం. నెల్లూరుచేరి, రాత్రి పూరీప్యాసింజరులో బయలుదేరి 5 వ తేది 7 గం. తెనాలి చేరుకురు. 1 గం. రాజకీయ బాధితుల సభకు హాజరయి, 6 తేది ఉదయం తిరిగి మదరాసు వత్తురు.

**నెల్లూరులో కార్యక్రమం**

4-9-47 ఉదయం గ్రాండు ట్రంకు యక్స్‌ప్రెస్‌లో బయలుదేరి 11-57గం॥కు నెల్లూరు వత్తురు.

మధ్యాహ్నం రైతుల రాయబారం, రాజకీయబాధితుల సభ, నెల్లూరు జిల్లా జమీన్ రైతుసంఘంవారి మెమోరాండం అందుకొనుట.

రాత్రి 9-30 గం.లకు వినాయకహాలులో శ్రీ కస్తూరిదేవి విద్యాలయ సహాయార్థం జరుగు లీలావాన్యాకర్ నాటకీయులు 'భరత నాట్యము'నకు అధ్యక్షతవహింతురు.

రాత్రి ప్యాసింజరులో తెనాలి వెళ్లెదరు.

# అబిసీనియాపై ఇటలీ జరిపిన దండయాత్రకు ఇండొనీసియాలో డచ్‌వారు జరుపుతున్న యుద్ధం ఏమాత్రం తీసిపోదు

## రష్యన్ వ్యాఖ్యాత నిశిత విమర్శ

మాస్కో, ఆగస్టు 31: "ఫాసిస్టు ఇటలీ అబిసీనియాపై జరిపిన దండయాత్రకు, ఇండొనీసియాలో దురాక్రమణజరుపుతున్న డచ్ కిరాతకచర్యకు ఏమాత్రమూ భేదా లేదు. అందువల్లనే భద్రతా మండలిలోని అధిక సంఖ్యాకుల ప్రవర్తన, అబిసీనియా దండయాత్ర కాలములో నానాజాతి సమితి సభ్యుల ప్రవర్తనను జ్ఞప్తికి తెస్తున్నది" అని ప్రఖ్యాత సోవియట్ పత్రికా రచయిత బోరిస్ ఇస్‌కోవ్ "ప్రవదా" పత్రికలో వ్రాశాడు.

## జావాలో యుద్ధం

బటేవియా, ఆగస్టు 31: సుమత్రా, జావాలలో పరిసర్దుప్రాంతములలో రిపబ్లికన్‌దాడులు ఉధృతముగా జరుగుచునే యున్నవనియూ, వానిని అదుపులో పెట్టుటకు డచ్ గస్తీదళములు పనిచేయుచున్నవనియు డచ్ అధికారప్రకటన వెలువడినది. జోగ్జకర్తాకు పశ్చిమంగా 100 మైళ్లలో వున్న గాంబోంగ్ పట్టణంలో 200 మంది రిపబ్లికన్ సైనికులు తిరుగుబాటు జరుపగా, వారిని తరిమి వేసి ఒక మరఫిరంగిని డచ్‌వారు స్వాధీనపరచుకున్నారు. సుమత్రాలో యిదివరకు రిపబ్లికన్ రాజధానిగా వుండి, "పోలీసుచర్య"లో డచ్‌వారిచే ఆక్రమింపబడిన పెమటాంగ్, సైంతార్ పట్టణముపై రిపబ్లికన్లు దాడిజరిపినారు. కాని తిరుగగొట్టి వేయబడినారు. డచ్ ఆక్రమిత ప్రదేశములన్నిటిలోను రిపబ్లికన్ సైనికులు ప్రజలపై ఒత్తిడిచేయుచునే యున్నారు. అని డచ్‌వారు ప్రకటిస్తున్నారు.

## హాలెండుకు వాన్‌మూక్ ప్రయాణం

డచ్-ఇండొనీషియా వివాదములను పరిష్కరించుటకు ఐక్యరాజ్యసమితిచేసిన సూచనలనుగురించి డచ్ మంత్రివర్గముతో చర్చించుటకు డచ్‌గవర్నర్ జనరల్ డా॥ వాన్‌మూక్ ఈరోజు విమానంలో హాలెండు వెళ్ళుచున్నాడు. భద్రతామండలిలో డచ్‌ప్రతినిధి ఆడ్రోక్వెవర్, డచ్ ప్రభుత్వ ప్రచారకశాఖ కార్యదర్శి డా॥ కోజింగాగారలుకూడ ఈయనవెంట హాలెండు వెళ్లెదరు. వీరందరూ మంగళవారంనాడు ఆంస్టర్‌డాం చేరగలరని తెలుస్తున్నది.

## మహాత్మునితో బెంగాల్ ప్రముఖుల సంభాషణ

కలకత్తా, ఆగస్టు 31: నేటి మధ్యాహ్నము అమృతబజారు పత్రిక సంపాదకులగు శ్రీ తుషారకాంతి ఘోషుగారు సతీ సమేతంగా మహాత్ముని దర్శించిరి.

బొంబాయి ప్రభుత్వ విద్యా సలహాదారు కె. జి. సయ్యిదేయును, మరియు విద్యాశాఖాధికారి డా॥ ఎస్. వి. జాగారలు నేటి మధ్యాహ్నము మహాత్ముని దర్శించిరి.

కలకత్తా యందలి బెంగాల్ వాణిజ్య సంఘము, బెంగాలీ జాతీయ వాణిజ్య సంఘము, భారత వాణిజ్య సంఘము, ముస్లిం వాణిజ్య సంఘము, మార్వారీ వాణిజ్య సంఘాధ్యక్షులు మహాత్ముని దర్శించిరి.

# మూడురాజ్యాలుగా పాలస్తీనా విభజన

## ఐక్యరాజ్యసమితి ఉపసంఘనివేదిక

జినీవా, ఆగస్టు 31: పాలస్తీనా సమస్య పరిష్కారానికై నియమితమైన ఐక్యరాజ్యసమితి ప్రత్యేక సంఘం సర్వసభ్య సమావేశాని కర్పించేందుకు తాను తయారుచేసిన సూచనల నివేదికపై ఈ రాత్రి సంతకం చేసింది.

పాలస్తీనా భవిష్యత్పరిపాలన విషయంలో సంఘంలో అధిక సంఖ్యాకులు ఆర్థికైక్యతతో మూడురాజ్యాలుగా విభజించాలని సూచించారు. దీనిప్రకారం పాలస్తీనా అరబ్ రాజ్యం, యూదురాజ్యం, జెరూసలేమ్ అనే మూడుభాగాలుగా విభక్తమవుతుంది. రెండేళ్లు పరిణామకాలం అయినతర్వాత (సెప్టెంబరు 1 న మొదలుపెట్టి) అరబ్ యూదు రాజ్యాలు స్వతంత్రమవుతాయి. స్వాతంత్ర్యం గుర్తింపబడకముందు ఇవి ఒక రాజ్యాంగాన్ని తయారుచేసుకోవాలి. పాలస్తీనా ఆర్థికైక్యత చెడకుండా రెండురాజ్యాలూ ఒక సంధిచేసుకుని కొన్ని రక్షణల విషయంలో ఐక్యరాజ్యసమితికి హామీ ఇవ్వాలి.

ఇండియా, పర్షియా, యుగోస్లావియాలు జెరూసలేమ్ ప్రధాన పట్టణంగా పాలస్తీనాను స్వతంత్ర ఫెడరల్ రాజ్యంగా చెయ్యాలని సూచించాయి.

ఈ రెండు సూచనలనూ ప్రత్యేక సంఘం తన నివేదికలో చేర్చింది.

ఇవికాక సాధారణ విషయాలను గూర్చి 11 సూచనలను ఈ సంఘం ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇందులో త్వరలో మాండేట్ రద్దుకావాలని, పరిణామకాలం సాధ్యమైనంత తక్కువకావాలనీ, మత విషయకంగా పవిత్రమైన సంస్థలూ, మైనారిటీల హక్కులూ రక్షింపబడాలని మొదలైనవి ఉన్నాయి. పాలస్తీనా సమస్య విషయంలో ఏ పరిష్కారమైనా అసలు యూదు సమస్యను పరిష్కరించినట్లు కాదని సూచిస్తున్న 12 వ సూచనను యురుగ్వే, గౌటిమాలా ప్రతినిధులు అంగీకరించలేదు గాని సంఘం మెజారిటీ ఆమోదించింది.

[ఈ నివేదిక వివరాలు, సరిహద్దులు నిన్నటి పత్రికలోనే ప్రకటించబడినవి.]

## అరబ్ రాజ్యాల్లో విభేదాలు కల్గించటమే

### సాదీ అరేబియారాజు విమర్శ

జెరూసలేం, ఆగస్టు 31: "ట్రాన్స్‌జోర్డాన్ రాజు అబ్దుల్లా తన 'విశాలసిరియా' పథకంతో, ఈ క్లిష్టపరిస్థితుల్లో అరబ్ రాజ్యాలమధ్య విభేదాలు కలగచేస్తున్నాడు" అని సాదీ అరేబియారాజు ఇబిన్‌సాద్ ప్రకటించాడు. జెరూసలేంలోని సాదీ అరేబియాప్రతినిధికూడా ఈ విశాల సిరియాపథకం సిరియా స్వాతంత్ర్యానికి ముప్పుతీసుకువస్తుందని ప్రకటించాడు.

సిరియా, లెబనాన్, పాలస్తీనా, ట్రాన్స్‌జోర్డాన్‌లన్నీ కలిసి యూదుప్రమాదాన్ని ఎదుర్కోవాలనీ, ఇవన్నీ ఇరాక్‌తోకూడా కలిసి 'విశాలసిరియా' ఫెడరేషన్ను స్థాపించాలనీ ట్రాన్స్‌జోర్డన్ రాజు అబ్దుల్లా ప్రకటించాడు. ఈ పథకంలో సిరియాప్రభుత్వం సామ్రాజ్యవాదుల నెలకొల్పినదని ఆతడు విమర్శించాడు. దీనివలన సిరియా ప్రజాస్వామ్యానికి ముప్పువస్తుందనీ, ఈపథకం అరబ్ లీగ్ నిర్ణయానికే విరుద్ధమనీ సాదీ అరేబియారాజు ప్రకటించాడు.

**బ్రిటనుకు సంబంధంలేదు**

విశాలసిరియా పథకాన్ని బ్రిటిషుప్రభుత్వం బలపరుస్తున్నదన్న వార్త అబద్ధమనే, బ్రిటిషు స్వదేశమంత్రి హెర్బర్టు మోరిసన్ కామన్సులో ప్రకటించాడు.

## ఆం. రా. ఎలిమెంటరీ టీచర్ల అధిక్షేపణ

గుంటూరు, సెప్టెంబరు 1: ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ స్కూలు టీచర్ల ఫెడరేషనుయొక్క ప్రధాన కార్యదర్శియగు పి. రామసుబ్బయ్యగారు యిలా వ్రాయుచున్నారు:

ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ స్కూల్ టీచర్ల ఫెడరేషను కాలాకు జనరలు కవున్సిలు సమావేశము నిన్న ఆగస్టు 31 తేదీని బెజవాడలో జరిగెను.

సెప్టెంబరు 3 తేదీని ప్రయివేటు స్కూల్ టీచర్లందరును అధిక్షేపణార్థముగా ఆనాడు సాయంకాలము పాఠశాల పని మానివేసి ప్రతి యూరిలోను ఊరేగింపు జరిపి సభలుచేయవలెనని తీర్మానింపబడెను.

ఎలిమెంటరీ టీచర్ల న్యాయసమ్మతమైన కనీసపు కోరికలను నెరవేర్చు నిమిత్తమై ప్రస్తుత ప్రజా ప్రభుత్వ మంత్రివర్గమునకు మరి కొంత వ్యవధిని ప్రస్తుతము జరిగిన రాజకీయ పరిస్థితుల మార్పులను బట్టి యివ్వవలెననియు, రాష్ట్రీయ ఎలిమెంటరీ టీచర్ల ఫెడరేషను వారు సంకల్పించిన సమ్మెను ఇప్పుడు జరుపక వాయిదా వేయవలెననియూ సదరు రాష్ట్రీయ ఎలిమెంటరీ టీచర్ల ఫెడరేషనును కోరడమైనది.

# ఆంధ్ర రాజకీయ మహాసభ

మదరాసు, సెప్టెంబరు 1: ఆ. రా. కాం. సంఘ ఆఫీసు కార్యదర్శి ఎస్. వి. సుబ్బయ్యగారు యిట్లు వ్రాయుచున్నారు:—

రాష్ట్రసభా ప్రతినిధి రుసుము రూ 2 గా నిర్ణయింపబడినది. ప్రతినిధులు 7 వ తేదీ ఉదయానికే రావాలి. రెండు రోజులు భోజన బస వసతు లుచితంగా ఏర్పాటు చేయబడినవి. 7 సాయంత్రం జరిగే అధ్యక్షుని ఊరేగింపు నందుందరు ప్రతినిధులు పాల్గొనప్రార్థన. ఆహ్వాన ప్రతినిధులు రాగానే ఆహ్వానసంఘంవద్ద ప్రతినిధి టిక్కెట్లు తీసుకొనవచ్చును. 7 తేది ఉదయం పతాకోత్సవం జరుగగానే విషయనిర్ణయ సభ జరుగును. కనుక రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సభ్యులంతా 6 తేది రాత్రికే రావాలి.

కార్పొరేషనువారు రాజకీయసభ అన్నపార్కులో జరుప వీలులేదని శాసించేను అధికారు లన్నందున, ఆహ్వాన సంఘంవారు ద. ఇ. వాణిజ్యసంఘంవారి జాగాలో మూరుమార్కెట్టు ప్రక్క 5000 ప్రతినిధులకు సరిపోయే పందిరి వేయించుటకు ఆహ్వానసంఘంవారు ఏర్పాటు చేస్తున్నారు. 200 వాలంటీరులు (అందు 100 మంది బయటవూరు నుండి వచ్చినవారు) శిక్షణ పొందుచున్నారు. శ్రీ కర్లపాటి అప్పారావుగారు ప్రతినిధులందరికీ రెండురోజులు ఉచితంగా భోజనం యేర్పాటు కంగీకరించిరి. అధ్యక్షుని ఊరేగింపు 7 తేదీ సాయంకాలం 19 జతల ఎడ్లు కట్టిన రథంతో ఏనుగలు, ఒంటెలు, గుర్రాలతో ఏర్పాటు చేయబడినది.

**కాంగ్రెసు సేవాదళ సంఘ సమావేశం**

చెన్నపట్నం, సెప్టెంబరు 1: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సేవాదళ సంఘ కార్యదర్శి లచ్చన్నగారిలా ప్రకటిస్తున్నారు.

"సేవాదళ రాష్ట్ర సంచారపు రిపోర్టుతోపాటు, ఇటీవల పలాసాలో నిర్వహింపబడిన కాంగ్రెసు సేవాదళ శిబిర సమగ్ర నివేదిక, జమాఖర్చులు పరిశీలించుటకుగాను సెప్టెంబరు 5 వ తేదీ పగలు గం 3 లకు మద్రాసులో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయంలో రాష్ట్ర కాంగ్రెసు సేవాదళ సంఘ సమావేశం జరుగును. సభ్యులు తప్పక దయచేయ ప్రార్థితులు." లచ్చన్నగారు మరొక ప్రకటనలో ఈ దిగువ విజ్ఞప్తి చేస్తున్నారు.

రాష్ట్ర కాంగ్రెసు సేవాదళ సంఘం యిటీవల పలాసాలో కాంగ్రెసు సేవాదళ ఉపాధ్యాయులను తయారుచేసింది. ఇక ప్రతిజిల్లా తాలూకా కాంగ్రెసుసంఘాలు ఒక్కొక్క శిబిరం స్థాపించాలి. శిబిర స్థాపన కవసరసన్నాహాలు చేసేందుకు వెంటనే ఒక కమిటీని ఏర్పాటుచేస్తూ, ఎందరు వలంటీర్లను తయారు చేయనున్నదీ, ఎందరు శిక్షకులు కావలసిందీ, సెప్టెంబరు 15 వ తేదీ లోగా బెజవాడ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయానికి రిపోర్టులు పంపవలెను.

**కృష్ణానది నీటిమట్టం**

బెజవాడ, ఆగస్టు 30: ఈరోజు కృష్ణానది ఆనకట్ట పైనీరు 10 80 అడుగులున్నది.

**నా గోదావరినది నీటిమట్టం**

ధవళేశ్వరం, ఆగస్టు 28: ఈరోజు నా గోదావరినది వియ్యరులో నీరు 7 5 అడుగులున్నది.

# పతాకదినోత్సవసందర్భంలో సభల, ఊరేగింపుల నిషేధిస్తూ నిజాం ఉత్తరువు

## సంస్థానమంతటా ఉత్సవం జయప్రదంగా జరపడానికి కాంగ్రెస్ సన్నాహాలు

## హైదరాబాద్‌కు సమీపంలో బాంబులు తయారుచేసే యంత్రాగారం

హైదరాబాద్, అగస్టు 31: సెప్టెంబరు 1 వ తేదీనుంచి 7 వ తేదీ వరకూ ఎక్కడా ఐదుగురు కానీ, అంతకంటే ఎక్కువ మందికానీ సమావేశం కారాదనీ, ఆయుధాలు చేతపుచ్చుకొని తిరగరాదనీ సమావేశముల నిషేధిస్తూ ఉత్తరువు అమలు జరిపినట్లు నిజాం ప్రభుత్వం నేడొక ప్రకటన చేసింది.

సంస్థాన కాంగ్రెస్ చేసిన ప్రకటన ననుసరించి సెప్టెంబరు 2-న ఇండియన్ యూనియన్ పతాకవందనోత్సవాలు జరుపడం ప్రజాశాంతికి భంగం కలిగించవచ్చుననే ఉద్దేశంతో ఈ ఉత్తరువు జారీచేయడమైనది.

### బాంబులు తయారుచేసే పరికరాలు పట్టుబడుట

నిజాం సి. ఐ. డి. వారు ఇక్కడికి 16 మైళ్ల దూరాన వున్న పోచంపల్లిలో ఒక ఇంట్లో విస్తారంగావున్న ప్రేలుడు పదార్థాలూ, బాంబులు తయారుచేసే పరికరాలూ పట్టుకొన్నట్లు తెలిసింది. తయారైవున్న చాలా ఇత్తడి బాంబులుకూడా దొరికాయట. ఈ సందర్భంలో ఒక కమ్మరివానినీ మరిద్దరిని అరెస్టు చేశారు.

### పటేల్ రాజీనామా

ఘనపురం, అగస్టు 26: వరంగల్లు తాలూకాలోని ఘనపురం, శివునిపల్లె, గ్రామాలపోలీసు, పటేలుగా పనిచేస్తున్న శ్రీ చింతకుంట్ల చిన రంగా రెడ్డి గారు, నిజాం ప్రభుత్వం స్టేటు కాంగ్రెసును అణచడానికి సాగించిన పద్ధతులపట్ల అసమ్మతి తెలుపుతూ తమ గ్రామోద్యోగ పదవులకు రాజీనామానిచ్చిరి. ఇకముందు వారు స్టేట్ కాంగ్రెసు పోరాట కార్యక్రమంలో పాల్గొనెదరని తెలుస్తున్నది.

### ఉద్యమ నిర్వహణలో అహింసా ప్రాధాన్యం

హైదరాబాదు, అగస్టు 28: స్టేటు కాంగ్రెసు నాయకులలో శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు ఈ క్రింది ప్రకటన గావించుచున్నారు:

హైదరాబాదు, సికింద్రాబాదులలో జాతీయపతాకమునకు ఎట్టి అవమానము కలిగించలేదనియూ, ఈవిషయంలో ఎవరిని ముట్టుచేయలేదనియు, నిజాముప్రభుత్వ రేవారు ఒక ప్రకటనచేసియున్నారు. కాని నిజాంరాష్ట్రంలోని అనేకస్థలముల నుండి వచ్చుచున్న సమాచారము లు మాత్రము ప్రభుత్వమువారి మాటలకు బొత్తిగా విరుద్ధములైయున్నవి. యథార్థ మేమనగా—ప్రభుత్వమువారు ఒక హుకుముద్వారా యూనియను పతాకమును బహిరంగస్థలములలోను, సమావేశముల లోను ఎగరవేయుటగాని, దానికి వందనముచేయుటగాని కూడదని నిషేధించిరి. ఆహుకుముకు ఫలితముగా జిల్లాలలోను, నగరములలోను పుడుస్థానికాధికారులు జాతీయపతాకమును అది ఎక్కడెక్కడ ఎత్తబడియుండునో అక్కడనుండి దానిని దించివేసి, జప్తుచేసుకొనుటయు, దానిని ఎత్తినవారిని అరెస్టు చేయుటయు అవసరమైపోయినది. మరియు "హిందూ యూనియన్ యొక్క పతాకమును మేము ఆసలే ఎత్తనీయము" అని ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘము నాయకులు ప్రకటన చేసిన తరువాత ఇప్పుడు సంభవించినట్టి సంఘటనలు ఏర్పడకుండుటను ఆశ ఎట్లు కలుగగలదు. ఇప్పుడు ప్రభుత్వము వారు తమ బాధ్యతనుండి తప్పించుకొనగోరినచో అది నెరవేరుపనియము. కాని "ఈ సందర్భంలో ఎట్టిఅక్రమములు జరుగలేదే"వని ప్రభుత్వమువారు చెప్పటమాత్రము యదార్థమునకు మారుమనక తప్పదు.

సికింద్రాబాదులో ఇటీవలజరిగిన దురంతములను గురించి నేను హృదయపూర్వకముగ విచారమును తెలుపుచు, చెప్పవలసి వచ్చిన సంగతి యేమనగా ప్రభుత్వమువారి ఉద్దేశము, కాంగ్రెస్‌ను ఏవిధముగానైనను దుర్గతిపాలు చేయవలయుననునదియే యని ఈ విషయములో వారు జారీచేసిన ప్రకటన స్పష్టముగా తెలుపుచున్నది. స్టేటు కాంగ్రెస్‌వారు సత్యాగ్రహమును ప్రారంభించినా రనుమాటయు, సత్యాగ్రహోద్యమమునకు రాజ్యములో అంతటను బలము చేకూరుచున్న దనుమాటయు నిజమే. కాని ఈ యుద్యమము ఏమాత్రమూ హింసతో కూడినది కాదు. ఈ వుద్యమము సత్యము, అహింసయను సిద్ధాంతపుటాదులపై ఆధారపడి యున్నది. ఆ సిద్ధాంతముల ననుసరించియే నడుపబడుచున్నది. ఈ విషయములో స్టేటు కాంగ్రెస్ అధ్యక్షు మహాశయుల ప్రకటన స్పష్టముగను, అసందిగ్ధముగను వున్నది. ఇప్పుడు ప్రభుత్వమువారి నిర్బంధము నందున్న స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులు స్వామీజీ ఎల్లప్పుడును సత్యము, అహింస అను సిద్ధాంతములను ఆచరణలో నుంచవలయునని నొక్కి చెప్పిరి. ఇప్పటి వరకును ఈవుద్యమము పూర్తిగా అహింసా పద్ధతినే అవలంబించియున్నది. అట్లుండియు వాతావరణమున హింసాపద్ధతి కలదు. కాని దీనిబాధ్యతను స్టేటు కాంగ్రెసుపైన ఆరోపించ వీలులేదు. ఇప్పుడు వ్యక్తమగుచున్న హింసాపూర్వకమగు వాతావరణమును సృష్టించిన బాధ్యతప్రభుత్వమువారిపైన వున్నదని నేను అనను. అయినను ఈ కాలపు అసహ్యమగు చిత్తవృత్తిని పోషించుటలోను, వాతావరణములో హింసాపద్ధతి ఉత్పన్నించుటలోను, ప్రభుత్వమువారు మౌనముగా పాల్గొన్నారని మాత్రము తప్పక చెప్పగలను. ఇప్పటి వరకు సాగివచ్చుచున్న ఆచార మేమనగా ప్రభుత్వమువారు తాము చేయు బహిరంగ ప్రకటనలలోను, పత్రికా సమాచారములలోను, ఇట్టికలహములుజరిగినప్పుడు ఏమతం వారు ఏమతమువానిపైన దాడిచేసిరో, ఏ మతమువాడు ఏమతమువానిచేత చంపబడెనో ఆవివరములు తెలుపకుండెడిది. ఇటీవల బ్రిటిషు ఇండియాలో జరిగిన కలహముల సందర్భమున వందలకొలది జనులు నష్టమైనారు కాని అచ్చటి ప్రభుత్వముల వారు మతముల వివరములు బయటపెట్టక కేవలము జరిగినదురంతముల సంఖ్యను మాత్రము తెలియజేయుచున్నారు. కాని విచారకరమగు సంగతి ఏమనగా మనప్రభుత్వంవారు ఇటీవల చేసిన ప్రకటనలో తమ పూర్వసంప్రదాయములను పత్రికలవారికి తాము చేసిన బోధలను ఉల్లంఘించి యున్నారు. ఇట్టిస్థితిలో ఇకముందు మతకక్షుల వాతావరణము చెడిపోదని కాని, హిందూ ముస్లిముల పరస్పరసంబంధము పాడైపోదని గాని ఎట్లు ఆశించవచ్చును. కావున సికింద్రాబాదులో జరిగిన దురంతములనుగురించి జారీచేయబడిన ప్రకటనను సిద్ధపరచినవారు ప్రభుత్వముయొక్క పరిస్థితిని చెడగొట్టినారని నేను చెప్పినచో నన్ను క్షమించవలెను.

తుదకు నేను కాంగ్రెస్‌వారితో చేయు మనవి—వారికి నేనిచ్చుచున్న హెచ్చరింపు ఏమనగా వారు యిప్పటి పరిస్థితియొక్క తాకిడికి లోబడకూడదు. వారు అహింసా సిద్ధాంతమును నిశ్చలముగ నమ్మి రక్షించవలెను.

### గ్రామోద్యోగులకు రహస్యతాఖీదు

వరంగల్లు, అగస్టు 25: నిజాం ప్రభుత్వం, వరంగల్లు జిల్లాలోని గ్రామోద్యోగీయులందరికీ, స్టేటుకాంగ్రెసు ఉద్యమాన్ని అణచుటవిషయంలో రహస్యంగా తాకీదులు పంపినట్లు రూఢిగా తెలిసింది.

ప్రభుత్వ ఆబ్కారీ విధానాన్ని ఉల్లంఘిస్తూ, తాటి, ఈతచెట్లు నరికివేయుటాన్ని సంస్థానంలో ఒక ప్రముఖసంస్థ ప్రోత్సహిస్తూ వున్నదని సూచిస్తూ, గ్రామాదులయందు అటువంటి కార్యక్రమం కొనసాగినచో, దాని బాధ్యత పూర్తిగా గ్రామోద్యోగులమీదనే వుండగలదని, ప్రభుత్వం ఆ తాఖీదులో హెచ్చరించినట్లు తెలిసింది.

రైల్వేలైను ప్రక్కగా వున్న గ్రామాల పటేలు పట్వారీలు, రైల్వేలైను మరియు టెలిగ్రాఫ్ స్తంభాలను కాపలా వుంచాలనియును, వాటిరక్షణ బాధ్యత పూర్తిగా ఆగ్రామోద్యోగీయులమీదకే వుంచగలనని కూడ ప్రభుత్వం హెచ్చరించినట్లు తెలుస్తున్నది.

నిజాంప్రభుత్వం జారీచేసిన ఇటువంటి తాకీదులవల్ల ఇటీవల చాలమంది గ్రామోద్యోగులు తమపదవులకు రాజీనామా లిచ్చియున్నారు, అనతి కాలంలోనే చాల మంది ఇదే మార్గాన్ని అనుసరించనున్నట్లు తెలుస్తున్నది.

### పతాకదినోత్సవ ప్రాధాన్యం

#### శ్రీ మాడపాటి రామచంద్రరావు గారి ఉపన్యాసం

బెజవాడ, అగస్టు 27: "నిజాన్ని ఒప్పుకునే ధైర్యంలేని నిజాం ప్రభుత్వం సత్యం గ్రహించేలాగా చేయడానికి, భారతీయులైన మనం మన జాతీయపతాకాన్ని ఎగురవేసే జన్మహక్కును ఎన్ని త్యాగాలుచేసి అయినా సాధించుకోవడానికీ, హైదరాబాదు స్టేటుకాంగ్రెసు కార్యాచరణసంఘం వారు రెండవ సెప్టెంబరు మంగళవారంనాడు సంస్థానమంతటా జాతీయపతాకాన్ని పల్లెపల్లెలలోను, పట్టణాల్లోను, ప్రతియింటి మీద, ప్రతివ్యక్తి వుడుపులమీద, బండ్ల మీద, సైకిళ్ల మీద, సర్వత్రా అలంకరించాల్సిందనీ, బహిరంగప్రదేశాలలో సమిష్టిగా, సలాంభవంగా జాతీయపతాకవందనం జరుపాల్సిందనీ తీర్మానించారు. స్టేటు కాంగ్రెసు అజ్ఞ హైదరాబాదు ప్రజానీకానికి శిరోధార్యమై తీరుతుంది" అని స్టేటు కాంగ్రెసు కార్యాచరణ సంఘ సభ్యులు శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు నేటి సాయంత్రం శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావుగారి యింట్లో, స్టేటు కాంగ్రెసు ప్రచార శాఖవారు ఏర్పాటుచేసిన ప్రార్థనాసమావేశములో ఉపన్యసించారు.

నిజాం సంస్థానంలో భారత యూనియను పతాకానికి కలిగిన అవమానాన్ని ప్రసక్తికి తెచ్చి శ్రీ రామచంద్రరావుగారు ఇంకా ఈలా అన్నారు:

11 వ జూన్ నాటి ప్రకటనలో, తాను వ్యక్తిగతంగా, స్వయంగా, సంపూర్ణ రాజ్యాధికారానికి అర్హుడనవుతానని కల్పించిన నిజాం 14 వ అగస్టు నాటికి కొంతదిగి సంపూర్ణ రాజ్యాధికారం సంస్థానానికి సంక్రమిస్తుందన్నాడు. ఇంగ్లీషులో స్టేటు అని అన్నాడు.

ఇదే సందర్భాన్ని పురస్కరించుకుని, నిజాం ప్రభుత్వ కార్యనిర్వాహకుడు మరొక ప్రకటన చేశాడు. హైదరాబాదు స్టేటు సంపూర్ణ స్వతంత్రమైనది. దానికి స్వతంత్ర స్వకీయపతాకం వున్నది. కాబట్టి మరో అన్యదేశపతాకాన్ని ఈ సంస్థానంలో ఎగురవేయకూడదు. ఈ ఆజ్ఞకు భిన్నంగా ప్రవర్తిస్తే మూడు సంవత్సరాల కఠినశిక్షకు పాత్రులౌతారు అని ఆ ప్రకటన. అయితే భారత యూనియన్ ప్రభుత్వానికి చెందిన పోస్టు, టెలిగ్రాఫ్ కార్యాలయాల మీద భారత యూనియను పతాకాన్ని పెట్టవచ్చుననీ, అదికూడా, నిజాం పతాకాన్ని యూనియన్ పతాకంతో సమానంగా ఎగురవేస్తేనే వర్తిస్తుందని ప్రకటన అయింది.

ప్రకటనే తల్లక్రిందులుగా వుంటే, ఆచరణ ఇంకా అయోమయం. ఆచరణలో నిజాం ప్రభుత్వం, దాని అంగబలము, ఆత్మబలము ఇత్తె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ వారూ, సంస్థానమంతటా, స్టేటు కాంగ్రెసు ఆదేశానుసారం 15 వ అగస్టునాడు వేలకొలది ప్రదేశాలలో భారత యూనియన్ పతాకాన్ని ఎగురవేస్తే అన్నిచోట్లా అవమానపరిచారు. బలవంతంగా పవిత్రపతాకాన్ని దింపి లాక్కున్నారు. జప్తు చేశారు, చించివేశారు, తగులబెట్టారు, తుపాకీగుండ్ల వర్షం కురిపించారు. కాంగ్రెసు కార్యకర్తలను అరెస్టుచేశారు హింసించారు. చావమోదారు. ఇదిచాలక, భారత యూనియనుకు చెందిన పోస్టు, టెలిగ్రాఫ్ కార్యాలయాల మీద ఎగురుతున్న పతాకాలకు సహితం ఇదే మర్యాద జరిపించారు.

భారత ప్రభుత్వ ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఈ సంగతి తెలుసుకొని, నిజామును సంజాయిషీ అడుగగా "నా ప్రభుత్వం అట్లాచేయలేదు. యూనియన్ పతాకాన్ని అవమానించలేదు. పైగా పతాకాన్ని ఎగురవేయటానికి సౌకర్యాలు కల్పించాం" అని అధికారరీత్యా నిజాం ప్రభుత్వంవారు చెప్పారు.

భారత ప్రజాపరిషత్తు సభ్యులకు ఈ సంఘటనలు తీవ్రకోపం కలిగించాయి. ఈ సంజాయిషీ తృప్తి కలిగించలేదు. పోస్టు టెలిగ్రాఫ్ కార్యాలయాలమీది పతాకాలకు జరిగిన అవమానాన్ని విచారించడానికి పోస్టల్‌శాఖ ఉన్నతోద్యోగి భారత ప్రభుత్వ నుంచి నిజాం వద్దకు వెళ్ళిన ప్రకటన పంపింది.

ఆ పరిస్థితులలో నిజాం ప్రభుత్వ సన్నిహితస్వరూపాన్ని ప్రపంచం ముందు బహిర్గతపరచటానికే, స్టేటు కాంగ్రెస్ కార్యాచరణసమితి, సెప్టెంబరు రెండును భారత యూనియన్ పతాక దినోత్సవంగా నిర్ణయించింది.

"అనేకకాల కృషి ఫలితంగా భారతీయులమైన మనం సాధించిన స్వతంత్ర భారత ప్రభుత్వం, నిజాం భావించినట్లు, పరప్రభుత్వం కాదు. యదార్థం విచారిస్తే ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలకు దేనికీ సంబంధించక స్వర్గంనుంచి వూడిపడ్డామనిభావించే, నిరంకుశమైనట్టి నిజాం ప్రభుత్వమే మనకు పరాయిది కాగలదు.

ఈ ప్రార్థనా సమావేశంలో చాలామంది నిజాం పౌరులు పాల్గొన్నారు. ఇక్కడ ప్రతిరోజూ ఇటువంటి ప్రార్థనా సమావేశములు జరుగుచున్నవి.

### పతాకోత్సవ సన్నాహాలు

హైదరాబాదు, అగస్టు 28: స్టేటు కాంగ్రెస్ కార్యాచరణ సమితివారు ఆదేశించిన ప్రకారం సెప్టెంబరు 2 వ తేదీన సంస్థానమందంతటా, భారత యూనియన్ పతాకాన్ని సలాంభవంగా ఎగురవేయుడానికి విపులసన్నాహాలు జరుగుతున్నట్లు ఇక్కడికి వార్తలు చేరుచున్నవి. స్టేటు కాంగ్రెస్‌వారు నిర్ణయించిన ఈ కార్యక్రమం ప్రకారం, సెప్టెంబరు రెండవ తేదీన మాత్రమే, ఈ యూనియన్ పతాక దినోత్సవం జరుగుతుందనియూ, ఆనాడు యూనియన్ పతాకాన్ని ఎగురవేయడం తప్ప, సత్యాగ్రహోద్యమంలో మరే కార్యక్రమము వుండబోదనీకూడా తెలుస్తున్నది.

### సత్యాగ్రహులకు శిక్షలు

మిర్యాలగూడెం, అగస్టు 25: అగస్టు 7 వ తేదీన, భారతయూనియన్ దినోత్సవ సందర్భంగా సత్యాగ్రహంచేసిన నల్లగొండజిల్లా, మిర్యాల గూడెంలోని 6 గురు కాంగ్రెసు కార్యకర్తలను విచారణచేసి, నిన్న మిర్యాలగూడెం మున్సబుకోర్టువారు కఠినశిక్షలును, జుల్మానాలను విధిస్తూ తీర్పు చెప్పినారు.

నాటిసభకు అధ్యక్షులుగా వున్న శ్రీ ఊట్కూరి లక్ష్మయ్యగుప్త సభాప్రారంభకులుగా వున్న కక్కిరేణి లింగయ్యగార్లలో, ప్రతిఒకరికి ఒక సంవత్సరపు కఠినశిక్షయు, 1,500 రూపాయల జుల్మానాయును జుల్మానా చెల్లించని పక్షంలో మరి 9 మాసముల కఠినశిక్షయును విధించడమైనది.

మరిముగ్గురు సత్యాగ్రహులు శ్రీ తిరునగరి రాఘవయ్య, అన్నబోయిన వెంకటరత్నం, తొనకునూరి లింగయ్యగార్లలో ప్రతిఒకరికి ఆరు నెలల కఠినశిక్షయు, 500 రూపాయల జరిమానయు, జరిమానా చెల్లించని పక్షంలో మరి మూడుమాసముల కఠినశిక్షయు విధించబడినది.

పై తీర్పుచెప్పిన తరువాత, అధికారులు, క్షమాపణలు చెప్పవలసిందిగా కార్యకర్తలను కోరినట్లును, అందుకు వారు నిరాకరించినట్లును తెలుస్తున్నది.

ఈ రాజకీయ ఖైదీలను మిర్యాలగూడెంనుండి నల్లగొండ జేలుకు తీసుకపోయినారని తెలుస్తున్నది.

### కాంగ్రెస్ కార్యాలయాలకు తాళాలు

వరంగల్లు, అగస్టు 26. వరంగల్లుతాలూకా కాంగ్రెసు, మరియు పట్టణ కాంగ్రెసు కార్యాలయాలను పోలీసులు సోదా చేసినారు. వారికి యీ సోదాలో యేమి లభించనట్లు తెలుస్తున్నది. ఆఫీసులకున్న తాళాలను పగులగొట్టి వేరు తాళాలను వేసి పోలీసులు, కార్యాలయాలను తమస్వాధీనంలో వుంచుకున్నారు.

### ఇల్లెందు తాలూకాలో అరెస్టులు

ఇల్లెందు తాలూకాలోని, గార్లజాగీరు వందున్న పండితాపురం గ్రామంలో అగస్టు 17 వ తేదీన శ్రీ బొగ్గారపు సీతారామయ్య, నూన్నె వీరవెంకటసుబ్బయ్య, పాటిబండ్ల రామలింగయ్య, రామకోటయ్యగార్లను, భారతయూనియన్ పతాకాన్ని ఎగరవేసినారనే నెపంమీద, గార్లజాగీరు పోలీసులు అరెస్టుచేసి సబ్ జైలుకు తీసుకవెళ్లినారు. వారిని గార్లజాగీరు కోర్టులో సెప్టెంబరు ఒకటవ తేదీన విచారించగలరని తెలుస్తున్నది.

మానుకోట తాలూకాలోని పృథ్వీడు, జయపురం, నర్సింలపేట కాంగ్రెస్ కార్యకర్తలను, నిజాం పోలీసులు అరెస్టుచేసి చేతులకు బేడీలువేసి, నడుములకు తాళ్లుకట్టి వరంగల్లు సెంట్రల్ జయిలుకు తీసుక పోయినట్లు తెలుస్తున్నది. అరెస్టు అయిన వారిలో శ్రీ పంగబత్తుల రంగారెడ్డి, కాటికొండ మురహరి, కాటికొండ లక్ష్మీకాంతం, బి. జగన్నాధరావు, అక్కి సోమయ్య, వంగాల వెంకటరెడ్డి, వానుకర్ల మధ్యగిరి, మొదలగు మానుకోట తాలూకా కార్యకర్తలున్నారు.

వీరు మానుకోట తాలూకాలోని కొన్ని గ్రామాలలో ప్రభుత్వ ఆజ్ఞను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహం చేసిరి.

హుజూరాబాదు తాలూకా సిద్దిపేట ప్రాంతంలోని కాంగ్రెసు కార్యకర్తలు శ్రీ నన్నా వెన్నారెడ్డి, దొడ్డింపుడి వెంకటరెడ్డి, మూటసేని గోపాల్, గాద కోటిరెడ్డి, తిరుపతిరెడ్డి, పోలిరెడ్డి గార్లను పోలీసులు అగస్టు 22 వ తేదీన బుగ్గారంపాడులో అరెస్టు చేసినారు.

### కాంగ్రెస్ కార్యకర్తల అరెస్టు

జనగాము కాంగ్రెసు కార్యకర్తలు శ్రీ పల్లె పీరయ్య, ఏలె నారాయణ, తమ్మళ్ల జగతయ్య, మొగిలిలక్ష్మీనారాయణగార్లను పోలీసులు అగస్టు 22వ తేదీన జనగాములో అరెస్టు చేసినారు.

వరంగల్లుతాలూకా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ సంతపురి జానకిరామ రావుగారిని 24 సాయంత్రం పెండ్యాల గ్రామంవద్ద రోడ్డుపైన మడికొండ పోలీసుజమేదారు, మరికొందరు పోలీసులువచ్చి అరెస్టుచేసినారు.

వరంగల్లు తాలూకా గ్రామాలలో ప్రక్కనున్న రైల్వేలైను మరియు టెలిగ్రాఫుస్తంభాలు కాపలాకావలెనని చేయవలసిందిగా ఆయా గ్రామ ప్రజలను పోలీసులు నిర్బంధిస్తున్నట్టు తెలుస్తున్నది.

వరంగల్లు జిల్లాను కల్లోలితప్రాంతంగా ప్రకటించబడిన సాకును ఆధారంగా చేసుకొని గ్రామాలలోని పటేలు పట్వారీలు ప్రజలనుండి విపరీతంగా లంచాలు వసూలు చేస్తున్నారు. ఖద్దరు కట్టుకున్న వారిని నిర్బంధిస్తున్నారు అని వార్తలు వస్తున్నవి.

కరీంనగరుజిల్లాలోని మంథెన్నలో పోలీసు ముంతజిమ్ కొంతమంది పోలీసులను వెంటబెట్టుకొని, భారత యూనియన్ దినోత్సవసందర్భంగా ప్రజలు తమ తమ ఇండ్లపై యెగురవేసుకున్న దాదాపు నలభై భారత యూనియన్ పతాకాల్ని స్వాధీనం చేసుకున్నాడు, స్థానిక కాంగ్రెసు కార్యదర్శి, శ్రీ పి. శ్రీరాములు గారి యింటికి తాళంవేసి ఉన్నప్పటికి పోలీసులు గోడలుయెక్కి ఇంట్లోకి దూకి జండా స్తంభాన్ని ఊడబెరికి పతాకాన్ని స్వాధీనం చేసుకున్నారు. శ్రీ పి. శ్రీరాములుగారిపై వారంటుకూడ వున్నట్లు తెలుస్తున్నది.

కొత్తగూడెంలో 25 వ తేదీన వుదయం 9 ఘంటలకు స్థానిక పోలీసు సబ్ యిన్‌స్పెక్టరుగారు కొందరు పోలీసులతో వచ్చి దుకాణములపైనను కొందరి ఇండ్లపైనను ఉన్న ఇండియన్ యూనియన్ పతాకాలను బలవంతంగా తీసివేసి తమవెంట తీసుకొని వెళ్లినారు.

గత ఆదివారం నాడు వరంగల్లులో ఝండా వందనం చేసినారనే నెపంతో వరంగల్లు పట్టణ కాంగ్రెస్ కార్యకర్తలైన శ్రీ నరిమేటి రామస్వామి, చంద్రయ్య, లక్ష్మయ్యగార్లను పోలీసులు 26 వ అరెస్టు చేసినారు.

మెదకుజిల్లా కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ వెంకట రాజేశ్వర జోషీగారిని అగస్టు 25 వ తేదీనాటి పగలు 12 గంటలకు పోలీసులు నిర్బంధించి, నాటి సాయంత్రం 3 గంటలకు సంగారెడ్డి జెయిలుకు తీసుకవెళ్లినారు. శ్రీ వెంకట రాజేశ్వర జోషీగారు మెదకుజిల్లాలోని ప్రముఖ కాంగ్రెసు నాయకులు. వీరిని పోలీసులు సంగారెడ్డికి తీసుకపోతుండగా, కొన్ని వందల మంది ప్రజలు స్టేటు కాంగ్రెస్ నినాదాలతో వీడ్కోలు నొసంగిరి.

అగస్టు 15 వ తేదీనుండి మెదకు జిల్లాలోని చాలా గ్రామాలలో భారత యూనియన్ పతాకాలను ఎగురవేయడము, ఆ కారణంగా పోలీసులు వారిని నిర్బంధించడం విరివిగా జరుగుతూ ఉన్నది.

మెదకులో భారత యూనియన్ పతాకవందనం చేసినారనే నెపంమీద కాంగ్రెసు కార్యకర్తలగు శ్రీరామ గౌడు, మున్నం పత్తయ్యగార్లను పోలీసులు అరెస్టు చేసినారు.

మెదకు తాలూకాలోని ధర్మవరం గ్రామం, కాంగ్రెస్ పతాకాన్ని ఎగురవేసినందుకు శ్రీ మల్లను గౌడును అరెస్టు చేసిరి. వీరుకాక, తాలూకాలోని ప్రముఖ కాంగ్రెసు కార్యకర్తలగు శ్రీ రామకృష్ణయ్య, అగముయ్య, లక్ష్మయ్య, భూమారెడ్డి, కోటారెడ్డిగార్లనుకూడా పోలీసులు అరెస్టు చేసినారు.

### తెలంగాణా నాయకుల అరెస్టు

మహబూబునగరం, అగస్టు 28: తెలంగాణా కాంగ్రెస్ అధ్యక్షులు సర్దార్ జమలాపురం కేశవరావుగారు తెలంగాణా సత్యాగ్రహోద్యమ డైరక్ ఆఫీసర్‌గా నియమించిన శ్రీ పల్లెర్ల హనుమంతరావుగారిని మహబూబునగరం పోలీసులు నిర్బంధించినారు. జిల్లాకాంగ్రెస్ ప్రముఖులు శ్రీ ఏగూరి చిన్నప్ప, వెంకటశేషశర్మ, సిద్ధలింగప్ప, మల్లప్పగార్లను కూడా పోలీసులు నిర్బంధించినారు.

ఆత్మకూరిసంస్థానంలో అమరచింతలో శ్రీ పరకాంతం వెంకటరామారెడ్డి, వెంకటరెడ్డి, బాలకృష్ణారెడ్డిగార్లను మరియు, బుద్ధారంలో శ్రీ కొత్తకోటవెంకటప్ప, పెరునాళ్ళ కుందేలాగార్లను కూడా నిజాం ప్రభుత్వం నిర్బంధించింది.

సేడం తాలూకాలోని ... గ్రామంలో శ్రీ ... మరియు మాచనకట్ల సుబ్బయ్య, రామచాలింగం, బొల్లం వెంకటనర్సయ్య మొదలగు పలువురు కాంగ్రెస్ కార్యకర్తలు, ప్రభుత్వనిషేధాజ్ఞలను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహం జరిపిరి.

ఇదే తాలూకాలో బంగరిగిరి గ్రామంలో కాంగ్రెస్ కార్యకర్తలు శ్రీ జాసె నర్సింహులు, నాగిరెడ్డిగార్లు సత్యాగ్రహం చేసినారు.

ఈ గ్రామంలో, ఇదేరోజు, కొందరు ప్రజలు సమిష్టిగావెళ్లి ఈతచెట్లను కొట్టివేసినారు. ఇంతవరకు యెవరి అరెస్టు కూడా జరుగలేదు.

సూర్యాపేట తాలూకా కాంగ్రెస్ ప్రముఖ కార్యకర్తలగు శ్రీ గోరింట సీతారామరావుగారిని నిన్న పోలీసులు అరెస్టు చేసి డిటెన్యూగా నల్లగొండకు తీసుకవెళ్లినారు.

మధిరతాలూకా కాంగ్రెస్ మాజీ కార్యదర్శి శ్రీ సంకొయలపాటి ప్రకాశరావు గారిని మధిరపోలీసులు నిర్బంధించినారు.

మధిరతాలూకా సీతారాంపురంలో ఎగురవేయబడిన భారతయూనియన్ పతాకాన్ని స్థానికపోలీసు పటేలు స్వాధీనపరుచుకున్నాడు.

### ఆబ్కారీశాసన ఉల్లంఘన

మహబూబునగరు జిల్లాలోని యెలికండ్ల, కాసం, పల్లి గ్రామాలలో అగస్టు 22వ తేదీన స్టేటుకాంగ్రెసు ఆదేశానుసారం వందలకొలది రైతులు దాదాపు 400 ఈత చెట్లను కొట్టివేసినారు.

ఇదే జిల్లాలోని ఎమునాన్‌పల్లి, జీనం, సిరిసనపల్లి మొదలగు చాలా గ్రామాలలో ప్రభుత్వ నిషేధాజ్ఞలను ఉల్లంఘిస్తూ, సత్యాగ్రహాలు జరిగినవి. కాని ప్రభుత్వం యింతవరకు యెవ్వరిని అరెస్టుచేయలేదు.

### శ్రీ బాపినీడుగారి ప్రకటన

చెన్నపట్నం, అగస్టు 31: నిజాంలో ప్రజల యిబ్బందులు రోజు రోజు పెరిగిపోతున్నవి. అచ్చటి ప్రజలకు తక్షణ రక్షణ, సహాయం చాలా తక్కువగా యున్నట్లు తోచుచున్నది. నిజాంనుండి అనేక మంది కొంది కులు నానా ప్రాంతములకు పోవుటయేగాక బెజవాడ, ఏలూరు మొదలగు ఆంధ్ర పట్టణములకు వందలకొలది కుటుంబములు వచ్చి పడుచున్నవి. పట్నాలలో యిది వరకే రేషను యిబ్బందికి తోడు అదనముగా వచ్చిన వారికి ప్రత్యేక రేషను యివ్వ వలసి యున్నది. ఈవిధంగా ఆహార సమస్య కూడ అధికమౌతుంది.

నిజాం ఆంధ్రుల సమస్య గురించి తీవ్రంగా ఆలోచించి అన్ని విధముల తోడ్పడ వలసిన అవసరం యెంతైనా గలదు. రాష్ట్ర కాంగ్రెసు వారి ఉప సంఘ సమావేశం 3వ తేదీ, బెజవాడలో జరుగునని ఆహ్వానము వచ్చినది. పై సమావేశం రాష్ట్ర రాజకీయసభలు జరుగునపుడు మద్రాసులో వేస్తే, అందరి నాయకులతోను, ప్రభుత్వంతోను సంప్రదించి, సమస్యా పరిష్కారమునకు తీవ్ర ఆలోచనలు చేయవచ్చును. గాన పై సమావేశం మద్రాసుకు మార్చ గోరెదను.

### రాయచూరులో మతకలహం

#### 70 ఇళ్లు తగులబెట్టబడినవి

రాయచూరులో అగస్టు 27-వ తేదీ మత కలహం సంభవించి, 70 ఇళ్లు తగులబెట్టబడినట్లు సంస్థానకాంగ్రెస్ కార్యాలయానికి తెలియవచ్చింది.

... ... కాంగ్రెస్‌వారు ... బడినట్లు ... కొం. కార్యాలయ ప్రకటనవల్ల తెలిసింది. కొప్పలలో సత్యాగ్రహం చేసినందుకు అరెస్టయిన 12 మందికి ఒక రోజు మొదలు ఒక సంవత్సరంవరకు వివిధాలుగా జైలుశిక్షలు విధించడమయింది.

### ఎన్. జి. ఓ. ల జీతాలు: పేకమీషన్ సిఫార్సులు

నిజాంప్రభుత్వంలోని నాన్‌గెజిటెడ్ ఉద్యోగుల జీతాలవిషయంలో పే కమీషన్ వారు చేసిన సిఫార్సులనూ, వాటిని ప్రభుత్వం పూర్తిగా ఆమోదించిందనీ, నిజాంప్రభుత్వ ఆర్థికమంత్రి నవాబు లియాకత్ జంగ్‌గారు నేడు పత్రికలవారితో గోష్ఠి జరుపుతూ ప్రకటించారు.

ఈ సిఫార్సుల ననుసరించి జీతాలు, యుద్ధానికిపూర్వం వాటికంటె నూటికి 66 పాళ్లు, నుంచి 25 పాళ్లువరకూ పెరుగుతాయి. తక్కువతరగతి ఉద్యోగులకు ఎక్కువలాభం కలుగుతుంది. సిఫార్సుల ప్రకారం ఏర్పడే స్కేళ్లు ఈ సంవత్సరం ఏప్రిల్‌నుంచి అమలులోవున్నట్లు ఎంచుతారు. కొత్తస్కేళ్ళవల్ల నాలుగు రెండున్నర కోట్లు అధికవ్యయం అవుతుంది. కనీసజీతం వస్తువులధరల ననుసరించి నిర్ణయించారు. కరువుభత్యంకూడా పెంచారు.

కొత్తస్కేళ్ళ ప్రకారం, కొత్తగా ఉద్యోగాల్లో చేరేవారికి కరువుభత్యం ఇంటిభత్యంతో సహా ఈ క్రింది విధంగా జీతాలు ముడుతాయి: బంట్రోతులు రూ 45, మూడవగ్రేడు గుమాస్తా (మెట్రిక్యులేట్ కానివాడు) రూ 60 మెట్రిక్యులేట్-రూ 87— ఇంటర్మీడియేట్ రూ 108—గ్రాడ్యుయేట్ రూ 148— కరువుభత్యం ఇచ్చే విషయంలో పెళ్లిఅయిన వారికీ కాని వారికీఉన్న వ్యత్యాసందద్దుఅయింది. ఈస్కేళ్లుస్థానిక సంస్థలు మునిసిపాలిటీలు మొదలైనవాటి ఉద్యోగులకు వర్తించవు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras